గ్రామాల్లో రోడ్ల అభివృద్ధికి
గాను ఆంధ్రకు 3 లక్షల
కేంద్రప్రభుత్వగ్రాంటు

— 3 వ పేజీ

# ఆంధ్రపత్రిక

కాల్వ తగాదాపై పాకిస్తాన్
ప్రచారం పట్ల ఢిల్లీ
అధికార వర్గాల ఆశ్చర్యం

— 8 వ పేజీ

318862

THE ANDHRA PATRIKA (WEEKLY EDITION) MADRAS సంపుటం 41. సంచిక 92 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO ఆదివారం 4-7-1954 Reg. No.M. 5745 8 పేజీలు 1 వెల అణా.

# భూమిసంస్కరణాలవిధానంపైసిఫార్సులకు కమిటీ నియామకం

## శ్రీ లక్కరాజుసుబ్బారావు అధ్యక్షులుగా, డా॥ శాయన్న కార్యదర్శిగ ఏర్పాటు

### ఐదుగురు సభ్యుల సంఘం 6 నెలల్లో నివేదిక సమర్పించాలని ఆంధ్ర ప్రభుత్వాదేశం

కర్నూలు, జూలై 3: రాష్ట్రంలో భూమి సంస్కరణల విధానం పరిశీలించేందుకు డా॥ లక్కరాజుసుబ్బారావు గారు అధ్యక్షులుగా ప్రభుత్వం ఒక కమిటీని నియమించింది. డా॥ సుబ్బారావుగారు, తూర్పు గోదావరిజిల్లా వాస్తవ్యులు.

ఆర్థికమంత్రి శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు, 54-55 సం॥ రం బడ్జెట్ ప్రతిపాదిస్తూ, శాసనసభలో చేసినవాగ్దానం పురస్కరించుకొని ప్రభుత్వం యీ కమిటీని నియమించింది.

ఈ కమిటీలో యీ దిగువవారు ఉన్నారు. (1) డా॥ లక్కరాజు సుబ్బారావుగారు (అధ్యక్షులు), (2) శ్రీ రొక్కం లక్ష్మీ నరసింహదొర (ఎం. ఎల్. ఏ.) గారు, (3) బి. ఎస్. మూర్తి (ఎం. పి) గారు, (4) పి. హెచ్. రామిరెడ్డిగారు (మైసూరు వ్యవసాయశాఖ రిటైర్డు డైరెక్టరు), (5) జి. నాగభూషణం ఎం. ఎల్. ఏ. గారు (సభ్యులు).

ప్రస్తుతం ఐక్యరాజ్య సమితి ఆహార వ్యవసాయ సంస్థలో పని చేస్తున్న డా. శాయన్న గారిని కమిటీకి అధికారిక కార్యదర్శిగా ప్రభుత్వం నియమించింది. డా॥ శాయన్న గారు ప్రస్తుతం రోంలో ఉన్నారు. అలవెన్సులు అవిగాక నెలకు వెయ్యి రూ.ల జీతంపై డా॥ శాయన్న గారిని ప్రభుత్వం రెండు సం॥ రాల కంట్రాక్టుమీద తీసుకొంటుంది.

సాధ్యమైతే ఆరునెలల్లోగా నివేదిక సమర్పించాలని ప్రభుత్వం యీ కమిటీని ఆదేశించింది. (స్వ. వి.)

## వియత్నాంపట్ల వియత్నాం ప్రజల గాఢాభిమానం

### కీలుబొమ్మ ప్రభుత్వ సైన్యంలో దళాలకు దళాలే పరారీ

సింగపూర్, జులై 2: ఇండోచైనాలో ఫ్రెంచి కీలుబొమ్మ అయిన వియత్నాం ప్రభుత్వ సైన్యంలో దళాలకు దళాలే పరారీఅయి వియత్మిన్‌లతో కలిసిపోతున్నవని ఇక్కడికి వార్తలు వస్తున్నవి. ఎర్రనది డెల్టాను ఫ్రెంచివాళ్ళు ఖాళీ చేయటమన్నది ఇండోచైనాలో ఫ్రెంచి సైనిక చర్యలకు భారతివాక్యంపాడటమేనని ఇక్కడి పరిశీలకులుభావిస్తున్నారు.

ఆగ్నేయాసియావ్యవహారాలన్నిటిమీదను తిరుతిరు ప్రభుత్వాలకు వర్తమానాలు పంపటానికి ఇక్కడఉన్న విదేశీయ పరిశీలకులు యావన్మంది అభిప్రాయమూ ఇదే.

ఫ్రెంచి యూనియన్ సేనలనుంచి వియత్నాంసేనల పరారీ మరీ విపరీతమయిపోతున్నట్లు వార్తలు వస్తున్నవి. కొన్ని నెలలకిందట పరారీఅయే వియత్నాంసైనికుల సంఖ్య పదుల్లో ఉండేది. కిందటి నెల అది వందలూ, వేలూ అయింది. ఇప్పుడది దళాలకు దళాలుగా తయారయింది.

ఇట్లా పరారీ అవుతున్న వాళ్ళందరినీ కనిపించకుండా పోయిన వాళ్ళ లెక్కల్లో ఫ్రెంచి అధికారులు చేరుస్తూ ఉంటారు. ఇదివరకు వియత్నాం యుద్ధాల్లో చనిపోయినవారికీ మూడు రెట్లు గాయపడ్డవాళ్లూ, దానికి మూడురెట్లు కనిపించకుండ పోయినవాళ్ళూ ఉండేవాళ్ళనీ, ఇప్పుడు పెద్ద పెద్ద పటాలాలే తెల్లవారేసరికి మాయమయి పోతున్నవనీ అక్కడినుంచి వచ్చిన ఒకవ్యక్తి రాయిటర్ విలేఖరికి తెలియజేశాడు.

#### ఎర్రనది డెల్టా ఉపసంహరణ

ఎర్రనది డెల్టాలో 1600 మైళ్ళ ప్రాంతంనుంచి ఉపసంహరణ కార్యక్రమాన్ని ఫ్రెంచి సేనలు జయప్రదంగా ముగించి కొత్తవ్యూహం తీర్చినవని ఫ్రెంచి సేనాని జనరల్ సాలాన్ నేడు ప్రకటించారు. ఒక్క పోరాటం కూడా జరపకుండా యావత్తు డెల్టాను ఫ్రాన్సు వదులుకుంటుందనే యిక్కడ అంతా అనుకుంటున్నారు.

#### వియత్నాంప్రధాని నిరసన

వియత్మిన్‌తో ఫ్రాన్సు చేసుకున్న రహస్య ఒప్పందం ప్రకారమే ఈ ఉపసంహరణ జరిగినట్లు వియత్నాంప్రభుత్వ వర్గాలు ఆరోపిస్తున్నారు.

వియత్నాం కొత్త ప్రధాని న్గోదిన్ దియాం నేటిరాత్రి ఒక ప్రకటన చేస్తూ ఫ్రెంచి ఉపసంహరణకు తీవ్రనిరసన వెల్లడించారు. ఈ చర్యవల్ల విషమరాజకీయ ఫలితాలు ఏర్పడగలవని తాను హెచ్చరించినట్లు కూడా ఆయన తెలియజేశారు.

పరిస్థితి సైనిక పరిస్థితులమూలంగా బలమయిన జాతీయవాద ప్రభుత్వాన్ని నెలకొల్పాలని దియాం చేస్తున్న కార్యక్రమం దెబ్బతిన్నట్లు పారిస్ వర్గాలు భావిస్తున్నారు. టోంకింగ్ డెల్టా యావత్తునుంచి ఫ్రాన్సు ఉపసంహరించబోతున్న సమయంలో దియాం ప్రభుత్వంలో వియత్నాం రాజకీయశక్తి లెవ్వరూ చేరరనే చెప్పవచ్చును.

#### యుద్ధ విరమణకు ఫ్రెంచి ప్రధాని దృఢనిశ్చయం

పారిస్, జులై 2: తాను నిర్ణయించిన గడువు-జూలై 20-వ తేదీలోపుగా యిండోచైనాలో యుద్ధ విరమణను సాధించటానికే ఫ్రెంచి ప్రధాని మెండీస్ ఫ్రాన్సు నిశ్చయించినట్లు నేడిక్కడ అధికారవర్గాలు వెల్లడించారు. యిండోచైనాలోనూ, ఉత్తరాఫ్రికాలోనూ పరిస్థితులు ముంచుకొని వస్తున్నప్పటికీ, వాటన్నిటిలోకీ స్వదేశంలో పరిస్థితులు విషమిస్తున్నప్పటికీ, ఆయన గడువులోపలే యుద్ధ విరమణ సాధించటానికి నిశ్చయించుకున్నారు.

## జాతీయఅభివృద్ధి ఋణసేకరణ

### శ్రీ నందా విజ్ఞప్తి

బెంగుళూరు, జూలై 2: రాష్ట్రాలు చేస్తున్న అప్పుల వల్లగాని, పనులు చేస్తున్న పన్నులవల్లగాని, పంచవర్ష ప్రణాళికను అమలుజరపటానికి కావలసినంత ధనం చేకూరడంలేదని. అందువల్ల ఋణ రాజస్వ విధానానికి దిగక తప్పనిస్థితి ఏర్పడుతున్నదని, కేంద్ర ప్లానింగుమంత్రి శ్రీ గుల్జారీలాల్ నందా నేడు ఇక్కడ వివరించారు.

ప్రభుత్వం ఈమధ్య జారీచేసిన జాతీయ అభివృద్ధి ఋణానికి ప్రజలు విరివిగా విరాళాలు ఇచ్చి, దేశాభివృద్ధి పట్ల తమకు గల శ్రద్ధను రుజువుచేసుకోవలసి వున్నదని, అట్లా ప్రజలు ముందుకు వచ్చినప్పుడే జాతీయాభివృద్ధి కొనసాగుతుందని అన్నారు.

రెండో పంచవర్ష ప్రణాళికనుగూర్చి మాట్లాడుతూ, అందులో పెద్ద పెద్ద పథకాలేగాక, స్థానిక సంస్థలు నడిపేందుకు లఘు పథకాలుగూడా కొన్ని వుంటాయని శ్రీ నందా వెల్లడిచేశారు.

## ఉస్మానియా విశ్వకళా పరిషత్తు భవితవ్యం

### విద్యాప్రవీణుల సంఘ సమావేశం

హైదరాబాదు, జూలై 2: విద్యా విధానాల, ఉస్మానియా విశ్వకళా పరిషత్తు భవిష్యత్తు వ్యవహారాలను పరిశీలించి, సలహాలు ఇవ్వటానికి భారత ప్రభుత్వం డాక్టరు జకీర్ హుస్సేన్ అధ్యక్షతన నియమించిన విద్యాప్రవీణుల సంఘం రేపు ఇక్కడ సమావేశమౌతుంది.

ఉస్మానియా విశ్వకళా పరిషత్తు భవిష్యత్ స్వరూప, పరిపాలనా విధానం హిందీబోధనా పద్ధతి ప్రవేశ ఆవశ్యకత, ప్రవేశ పెట్టవలిస్తే ఏ విధంగా హిందీని అమలు పర్చటం వంటి విషయాలను పరిశీలించవలసి ఉన్నది. హిందీ పూర్తిగా బోధనా భాష కాగలిగే వరకూ, యూనివర్సిటీ కళాశాలలలో ఇంగ్లీషు బోధనా విషయాన్ని కూడా పరిశీలిస్తుంది. ఈర్తా, మూడు ప్రాంతీయ భాషలను యూనివర్సిటీలో ప్రవేశపెట్టే ఉత్తమ పద్ధతులను కూడా ఆలోచిస్తుంది.

ఈ సంఘ అధ్యక్షుడు డాక్టర్ జకీర్‌హుస్సేన్ ఇవాళ ఇక్కడకు ఢిల్లీనుంచి వచ్చారు.

ఉస్మానియా విశ్వకళా పరిషత్తును కేంద్రహిందీ యూనివర్సిటీగా మార్పు చేయాలన్న ప్రతిపాదన ఆలోచనను వాయిదా వెయ్యాలని ఉస్మానియా విశ్వకళా పరిషత్తు సెనేట్, అకాడమిక్ కౌన్సిల్ సంయుక్త సమావేశం నిర్ణయించిందని పాఠకులకు తెలిసిన విషయమే.

ఉస్మానియా విశ్వకళా పరిషత్తు వ్యవహారాల పౌరుల సంఘం, విశ్వకళా పరిషత్తు అధ్యాపకుల సంఘం ఈ ప్రతిపాదనకు వ్యతిరేకించాయి.

## 154 లక్షల ఖర్చుతో హైద్రాబాదు పట్టణాలకు మంచినీటి సప్లయి

### భారతప్రభుత్వానికి 17 స్కీముల సమర్పణ

హైద్రాబాదు, జూలై 2:— "సిమ్లాలో ఇటీవల జరిగిన స్థానిక స్వపరిపాలనా మంత్రుల సమావేశంలో గ్రామీణ, పట్టణ ప్రాంతాలకు కుళాయిల ద్వారా మంచినీటి సరఫరా ఏర్పాట్లకు అత్యంత ప్రాధాన్యం ఇవ్వబడింది.

హైద్రాబాదు రాష్ట్రంలోని మూడు వేల జనాభాకు పైబడ్డ 1, 81 పట్టణాలలో ఇంతవరకూ 22 పట్టణాలలో మాత్రమే కుళాయిల ద్వారా మంచినీటి సరఫరా ఏర్పాటుకలదు.

ఇటీవలనే 153.87 లక్షల రూపాయలు అంచనా వేయబడ్డ 17 నీటి సరఫరా పట్టణ ప్రాంత ప్రణాళికలను ప్రభుత్వం భారత ప్రభుత్వ ఆరోగ్య శాఖకు అందజేసింది.

"25 వేల జనాభాకు పైగల పట్టణాల నీటి సరఫరా ప్రణాళికకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అప్పుఇవ్వాలనీ, 25 వేల లోపు జనాభాగల పట్టణాలకు సగం కేంద్రం, మిగతా భాగం రాష్ట్ర, స్థానిక సంస్థలు సమానంగా భరించాలనీ, సిమ్లా సభ నిర్ణయించింది. రాష్ట్ర ప్రభుత్వం రెండు ప్రతిపాదనలను పరిశీలించి, తదనుగుణ్యంగా ప్రణాళికలను రూపొందిస్తుంది" అని హైద్రాబాదు స్థానిక స్వపరిపాలన శాఖామంత్రి శ్రీ గోపాల్‌రావ్ ఎక్బోటే ఇవాళ ఇక్కడ మా విలేఖరి కలుసుకోగా వెల్లడించారు.

సిమ్లాలో జరిగిన స్థానిక స్వపరిపాలన మంత్రుల సమావేశంలో పాల్గొని ఎక్బోటేగారు ఇవాళ ఇక్కడకు తిరిగి వచ్చారు.

మంత్రి శ్రీ ఎక్బోటే మాట్లాడుతూ పైన సూచించిన విధానాల ప్రకారం మున్సిపల్ కమిటీలు తమ ప్రణాళికలను తయారుచెయ్యాలని ఆదేశిస్తామన్నారు.

## సమితిలోచైనా సభ్యత్వం: అమెరిక ప్రతిఘటన

### —డల్లెస్ ప్రకటన

వాషింగ్టన్, జులై 2: ఐక్యరాజ్య సమితిలో చైనాకు ప్రాతినిధ్యం ఇవ్వటాన్ని ప్రతిఘటించాలనే అమెరికా ఇంకా దృఢంగా అభిప్రాయ పడుతున్నట్లు విదేశాంగమంత్రి డల్లెస్ నేడు ప్రకటించారు.

సెనేట్ విదేశవ్యవహారాల కమిటీలో డల్లెస్ ఈ అభిప్రాయం వెల్లడించినట్లు కమిటీ తాత్కాలిక అధ్యక్షుడు సెనెటర్ స్మిత్ నేడు వెల్లడించారు. కమ్యూనిస్టుచైనా సమితిలోకివస్తే అమెరికా సమితినుంచి నిష్క్రమించాలని సెనేటు కు వచ్చిన ప్రతిపాదనమీద తాము డల్లెస్ అభిప్రాయాన్ని అడగలేదని ఆయన తెలియజేశారు.

సమితిలో పెకింగ్ ప్రభుత్వానికి స్థానం ఇవ్వవలసిందని ఐక్యరాజ్యసమితికి త్వరలోనే ప్రతిపాదనవచ్చే అవకాశం ఉన్నట్లు డల్లెస్ ఆ సమావేశంలో వెల్లడించి, ఆ ప్రమాదాన్ని 'అమెరికా' కనిపెట్టే ఉన్నట్లు తెలియజేశారు.

సమితిలో నవచైనాకు సభ్యత్వం ఇస్తూనే, భద్రతామండలిలో కొమింటాంగ్ చైనాను నిలిపిఉంచటానికి కూడా అవకాశం ఉన్నదని సెనేటర్ స్మిత్ వెల్లడించారు. అయితే ఆచరణలో అది సాధ్యపడక పోవచ్చునన్న సందేహం వెల్లడించారు.

## ముగ్గురుజడ్జీలతో జులై 5 నుంచి ఆంధ్ర హైకోర్టు ప్రారంభం

### — కేంద్రప్రభుత్వ ప్రకటన

న్యూఢిల్లీ, జూలై 2: జూలై 5 వ తేదీనుంచి ఆంధ్ర హైకోర్టు అనే పేరుతో ఆంధ్రరాష్ట్రానికి కొత్తహైకోర్టు ఏర్పడుతున్నదని కేంద్రప్రభుత్వం నేటిప్రకటనలో తెలియజేసింది.

మద్రాసు హైకోర్టు బెంచిలో ముగ్గురు—జస్టిస్ కె. సుబ్బారావు, జస్టిస్ సి. చంద్రారెడ్డి, జస్టిస్ కె. ఉమామహేశ్వరంగార్లు— ఆంధ్ర హైకోర్టుకు ఇవ్వబడ్డారని ఆ ప్రకటన తెలియజేస్తున్నది.

జస్టిస్ సుబ్బారావుగారు ఆంధ్ర హైకోర్టుకు ప్రధానన్యాయమూర్తిగా పనిచేస్తుంటారు.

## అక్టోబరునుంచి పాకిస్తాన్‌కు అమెరికా ఆయుధసామగ్రి సప్లయి

### అమెరికన్ రాయబారి ప్రకటన

#### వచ్చేనెలలోపరిశీలనకైకరాచీకి సైనిక నిపుణుల రాక

కరాచీ, జూలై 2: పాక్ అమెరికా పరస్పర సైనిక సహాయ ఒడంబడికను అనుసరించి రేపు అక్టోబరు మొదటి వారంనుంచీ అమెరికా పాకిస్తాన్‌లో ఆయుధాలను దింపడం ప్రారంభం చేస్తుంది.

ఈ విషయాన్ని నేడు కరాచీలో అమెరికా రాయబారిగా పనిచేస్తున్న హొరేస్ హిల్డ్రెత్ వెల్లడిచేశారు. ఈయన ఈ మధ్యనే అమెరికాకు వెళ్ళి, ఆరువారాలపాటు అక్కడ గడిపి వచ్చారు.

ఈ లోపుగా పాకిస్తాన్‌కు ఎటువంటి ఆయుధాలు అవసరమో, ఏమిటో పరీక్ష చేసి, నిర్ణయించేందుకుగాను వచ్చే నెలలో కొంతమంది సైనిక వేత్తలు కరాచీకి వస్తారు. ఈ వేత్తల సంఖ్య దాదాపు 30 మంది దాకా వుంటుంది ఇందులో పదాతి, నౌకా, విమానబలాధిపతులు గూడా వస్తారు.

అమెరికా ఈవిధంగా పాకిస్తాన్‌కు ఎంత సహాయం చేస్తుంది ఇంకా నిర్ణయం కాలేదు. పైన పేర్కొన్న వేత్తలువచ్చి ఆ నిర్ణయం చేస్తారు. ఆ తర్వాత ఈ సహాయం కొన్ని సంవత్సరాలపాటు జరుగుతుంది.

ఈ రాయబారి ఒక్క ఈ విషయాన్ని గురించేగాక, నీటికాల్వల తగాదాను గురించి, కాశ్మీర్ తగాదాను గురించి గూడా మాట్లాడారు. నీటికాల్వల తగాదాపరిష్కారం సహజమేనని అమెరికావారు భావిస్తున్నారని, కాశ్మీర్ వ్యవహారాన్ని తిరిగి భద్రతా సంఘం ముందుకు పంపడమే మంచిదని తాను భావిస్తున్నానని అన్నారు.

## టర్కీ ఆహ్వానానికి లిబియా తిరస్కృతి

### ఒప్పందంలో చేరడానికి నిరాకరణ

కైరో, జూలై 2: టర్కీ, పాకిస్తాన్ ఒప్పందంలో చేరవలసిందిగా కోరుతూ తనకు టర్కీపంపిన ఆహ్వానాన్ని లిబియా తిరస్కరించివేసింది.

ఈ విషయాన్ని నేడు అధికారవర్గం వారు గూడా ధృవపరిచారు. లిబియా ప్రధాని ఈమధ్య టర్కీకి వెళ్ళినప్పుడు టర్కీ యీ ఆహ్వానాన్ని ఆయనకు యిచ్చింది.

## గోవా అశాంతి

### ఢిల్లీ అధిక్షేపణకు పోర్చుగల్ తిరస్కృతి

లిస్బన్, జూలై 2: గోవాలో జూన్ 15 న, స్వాతంత్ర్యోద్యమ వార్షికోత్సవ సందర్భంలో గోవా అధికారులు 20 మందిని అరెస్టుచేయటం పట్ల, భారతప్రభుత్వం పోర్చుగల్‌కు అధిక్షేపణ అందచేసింది. దీనిని గురించి ఆలోచించడానికి పోర్చుగీసు ప్రభుత్వం నిరాకరించిందని, నేడు పోర్చుగల్ విదేశాంగశాఖ ప్రకటించింది.

"పోర్చుగీసు ప్రాంతాలను ఇతర దేశాలలో విలీనం చేయగోరే చర్యలు, పోర్చుగల్ చట్టరీత్యా నేరాలు. ఇటువంటి చర్యలలో పోర్చుగీసు పౌరులు పాల్గొన్నప్పుడు, ఆ విషయం గురించి ఇష్టంవచ్చినట్లు చర్యతీసుకునే అధికారం పోర్చుగల్‌దే. ఇందులో విజోక్యం కలగచేసుకునే హక్కు భారతదేశానికి లేదు. అందువల్ల ఇండియా అధిక్షేపణ గురించి ప్రభుత్వం ఆలోచించదు" అని ఆ ప్రకటన వివరించింది.

జూన్ 18 న, జరిగిన ప్రదర్శనలు ప్రేరేపించ బడినట్టివనీ, ఆ సందర్భంలో జరిగిన అరెస్టులూ, దర్యాప్తులూ చట్టబద్ధంగానే ఉన్నవనీ, అరులక్షల జనాభాలో 20మందిని అరెస్టుచేయటం ఏమంత పెద్ద విషయం కాదనీ కూడా ఈ ప్రకటన పేర్కొంది.

### గోవా సరిహద్దున బందోబస్తు

బొంబాయి, జూలై 3: భారతదేశం నుంచి, గోవాలోకి సత్యాగ్రహులు ప్రవేశించకుండా అరికట్టే నిమిత్తం బొంబాయి గోవాసరిహద్దుల పొడుగునా గోవా అధికారులు బందోబస్తు ఏర్పాట్లు చేస్తున్నారని తెలుస్తూంది. సరిహద్దులలో పోలీసుల తనిఖీ స్థావరాలు ఇప్పటికే చాలావరకు హెచ్చింపబడినవట.

## ప్రావిడెంట్ ఫండ్‌నుంచి జాతీయాభివృద్ధికి ఋణాలు

### కేంద్రప్రభుత్వ ఏర్పాట్లు

న్యూఢిల్లీ, జూలై 3: జాతీయాభివృద్ధి ఋణానికి అప్పుగా ఇచ్చేనిమిత్తం ప్రభుత్వోద్యోగులకు వారి ప్రావిడెంట్ ఫండ్ నిధులలోనుంచి కొన్ని షరతులప్రకారం డబ్బు తీసుకునేందుకు ఏర్పాట్లు చేయటానికి ప్రభుత్వం నిశ్చయించింది.

## రాజధానికి ముఖ్య మంత్రి రాక

కర్నూలు, జూలై 3: ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ ముఖ్య మంత్రి శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు నిన్న రాత్రి పదకొండు గంటలకు బెంగుళూరునుంచి రాజధానికి తిరిగివచ్చారు.

## 'గోవా విముక్తికి దృఢ నిశ్చయంతో కృషి చేయాలి'

### — ఇండియాలోని గోవా జాతీయవాదుల విజ్ఞప్తి

బొంబయి, జూలై 2: పోర్చుగీసుల బారినుండి విముక్తులమై, భారతదేశంలో కలిసి తీరుతామనే దృఢనిశ్చయం చేసుకొని, గట్టిగా కృషి చేయవలసిందని భారతయూనియన్‌లో నివసిస్తున్న వందమంది గోవాపౌరులు, నేడు గోవాలోని ప్రజ లందరికీ విజ్ఞప్తిచేశారు.

"ధైర్యసాహసాలతో, ఇట్టి నిర్ణయం చేయవలసిన తరుణం ఆసన్నమైంది. మన భవితవ్యం అటో ఇటో తేలవలసిన సమయం వచ్చింది. ఈ చారిత్రాత్మక సమయంలో గోవాప్రజలు ధైర్యం తెచ్చుకోవాలి. తమ భవిష్యత్తు తామే నిర్ణీతిలనీ, నిర్భయంగా ప్రకటించాలి" అని ఆ విజ్ఞప్తిపత్రంలో పేర్కొనబడింది.

భౌగోళికంగా, సాంస్కృతికంగా, ఆర్థికంగా, జాతిపరంగా, ఏ దృష్టితో చూచినా గోవాకి పోర్చుగల్‌కి సాన్నిహిత్యంలేదు. గోవాభవిష్యత్తు, భారతదేశంతో పెనవేసుకుని ఉంది. ఇక గోవాప్రజలు వేసోళ్ళ దాటాలి అని ఈ విజ్ఞప్తి పత్రంలో పేర్కొనబడింది.

ఈ పత్రాలు, గోవా, డయ్యూ, డామన్‌లోని ప్రజలకు పంచిపెట్టబడతవి. వీటిని మరాఠీ, పోర్చుగీసు, కొంకణి భాషలలో ముద్రించారు.

భారతదేశంలో నివసిస్తూ వివిధ రంగాలలో ఖ్యాతికెక్కిన గోవా పౌరులు వందమంది ఈపత్రంపై సంతకాలు చేశారు.

ఇండియాలో కేథలిక్ యూనియన్ మాజీజనరల్ సెక్రటరీ ఎ. సోర్స్, పార్లమెంటు మాజీప్రతినిధి హారి డి యా, బొంబయి మాజీ మేయరు మాస్కరనీ, ప్రభృతులు దీనిపై సంతకాలు చేశారు.

### ఆర్. కె నెహ్రూతో గోవా ప్రతినిధివర్గ చర్చలు

బొంబై, జూలై 2: కేంద్ర ప్రభుత్వ విదేశీ వ్యవహారాల శాఖ కార్యదర్శి ఆర్. కె. నెహ్రూ గోవా జాతీయోద్యమ నాయకుల రాయబార వర్గంలో కలిసి గోవాలో ఇటీవలి పరిస్థితుల గురించి, పోర్చుగీసు ప్రభుత్వంఅవలంబించిన నిరంకుశ ధోరణి గురించి చర్చించారు.

గోవాలో పోర్చుగీసు ప్రభుత్వ నిరంకుశ ధోరణివల్ల ప్రజలు హడలిపోతున్నారనీ, ఇప్పటికే చాలమంది ఇండియాకు కాందిశీకులుగా వెళ్లిపోతున్నారనీ, భారత ప్రభుత్వం ఇకనైనా చర్యతీసుకోక పోతే, పరిస్థితులు అదుపు మీరిపోతవనీ వీరు ఆర్. కె. నెహ్రూగారికి చెప్పారు.

బొంబైలోని గోవా పౌరులు నేడు ప్రకటించిన విజ్ఞప్తి పత్రం ప్రతిని కూడా ఆయనకు ఇచ్చారు.

ఆర్. కె. నెహ్రూ తిరిగి బొంబై ముఖ్యమంత్రి మొరార్జీ దేశాయి, ప్రధాన కార్యదర్శి భిస్సార్ గార్లని కలుసుకుని చర్చలు జరుపుతారు.

ఈ చర్చల వివరాలు అతి రహస్యంగా ఉంచబడుతున్నవి.

ఆర్. కె. నెహ్రూ తిరిగి సోమవారంనాడు ఢిల్లీకి వెళతారు

### జెనీవా సభలో జరిగిన కృషి

న్యూయార్క్, జూలై 2: "గత ప్రపంచ యుద్ధానికి తరవాత తూర్పు పశ్చిమరాజ్యాలు సమాధాన పడేందుకు జరిపిన మొదటి ప్రయత్నం జెనీవాలో జరిగింది. అందులో ఉభయపక్షాలూ సంకల్పశుద్ధిగా సమాధానం పడుచ్చుకునేందుకు ప్రయత్నించినవి" అని సమితిలో భారత ప్రతినిధివర్గ నాయకుడు కృష్ణమీనన్ నిన్న యిక్కడ తనను కలుసుకున్న అమెరికన్ ఉపాధ్యాయులకు తెలియజేశారు.

## గ్వాటిమాలాలో కమ్యూనిజంపై ధ్వజం

### ఆర్మాజ్‌మాన్‌జాన్ ఒప్పందం వివరాలు

గ్వాటిమాలాసిటీ, జూలై 2: గ్వాటిమాలాలో కమ్యూనిజాన్ని నిరోధించటానికీ, మాన్‌జాన్ ప్రభుత్వానికీ, ఆర్మాజ్ విద్రోహులకూమధ్య వివాదాన్ని సర్దుబాటు చేయటానికీ, నిశ్చయిస్తూ నేడు శాన్‌సాల్వడార్‌లో ఒప్పందం చేసుకోబడ్డది. కర్నల్ మాన్‌జాన్, కర్నల్ ఆర్మాజ్ లతోపాటుగా, మధ్య అమెరికా ప్రాంతంలో రోమన్ కాథలిక్ జగద్గురువు పోప్‌యొక్క ప్రతినిధి అయిన జనరల్ వెరోలినా కూడా ఒప్పందంపై సంతకం చేశారు.

సాల్వడార్ అధ్యక్షుడు కర్నల్ ఒజారియో ప్రతినిధి కార్లోస్ సావెజ్, గ్వాటెమాలాకుసాల్వడార్ రాయబారి అయిన అల్బర్టో ఫ్యూయెంటెస్ లు కూడా ఈ ఒప్పందంపై సంతకాలు చేశారు.

ఈ ఒప్పందం ప్రకారం గ్వాటిమాలాను పరిపాలించే సైనిక మండలిలో ఐదుగురు సభ్యులు ఉంటారు. కర్నల్ మాన్‌జాన్, కర్నల్ ఆర్మాజ్, మాన్‌జాన్ 'ప్రభుత్వం'లో విదేశాంగ మంత్రి కర్నల్ డ్యూబ్వా, విద్రోహ 'ప్రభుత్వం'లో రక్షణమంత్రి మేజర్ ఎలీనా, సైనిక మండలి ప్రస్తుత సభ్యుడు లెఫ్టినెంట్-కర్నల్ పాలాజార్ లు ఇందులో సభ్యులుగా ఉంటారు.

మాన్‌జాన్ ప్రస్తుతానికి ఈ మండలికి అధ్యక్షుడుగా ఉంటాడు. 15 రోజుల్లో మండలి కొత్త అధ్యక్షుణ్ణి ఎన్నుకుంటుంది.

గ్వాటిమాలా రేడియో నేడొక ప్రకటన చేస్తూ గ్వాటిమాలాలో కమ్యూనిజం అపజయం పొందిందనీ, ఇంక అంతా కలిసి దేశాన్ని అభివృద్ధి చేయాలనీ హెచ్చరించింది. ఇప్పటికి 500-కి పైగా కమ్యూనిస్టులు అరెస్టు చేయబడ్డారని తెలియజేసింది.

సాల్వడార్ ఒప్పందాన్ని పురస్కరించుకుని గ్వాటిమాలా సైనిక మండలి ఈ రోజును జాతీయ సెలవు దినంగా ప్రకటించిందనీ నగరమంతా అలంకరించబడ్డదనీ గ్వాటిమాలా రేడియో ప్రకటించింది.

గ్వాటిమాలా నగరానికి 40 మైళ్ళ దూరంలో ఉన్న ఎస్క్యూంటిల్ అనే కేంద్రంలో కార్లోస్ పెల్లెసర్ అనే కమ్యూనిస్టునాయకుడు రైతులను సంఘటిస్తున్నట్లు వార్తలు వచ్చినవి.

### గ్వాటిమాలా పరిస్థితులపై అమెరికా భయాలు

శాంటియాగో, జూలై 2. ఇటీవల గ్వాటిమాలాలో జరిగిన సంఘటనల ఫలితంగా, ఇప్పట్లో అక్కడ అఖిల అమెరికారాజ్యాల సంస్థ సమావేశాన్ని జరపటం మంచిదికాదని చిలీ ప్రభుత్వం అభిప్రాయపడుతున్నది మొదట ఈ అనుమానాన్ని చిలీ ప్రభుత్వానికి అమెరికన్ రాయబారి బోలాక్ వల్ల చెప్పించినట్లు ప్రభుత్వ సన్నిహితవర్గాలు వెల్లడించారు.

### గ్వాటిమాలా మాజీ అధ్యక్షుని ఆత్మహత్య?

గ్వాటిమాలా సిటీ, జూలై 2 గ్వాటిమాలా మాజీఅధ్యక్షుడు కర్నల్ జాకబ్ ఆర్బెంజ్ ఆత్మహత్య చేసుకున్నట్లు ఇక్కడ వదంతులు వ్యాపించినవి. ఆయన ఇక్కడి మెక్సికో రాయబారి కార్యాలయంలో తలదాచుకున్నాడనీ, అక్కడే ఆత్మహత్య చేసుకొన్నాడనీ చెప్పుకుంటున్నారు, అయితే ఇవి ఇంకా ధృవపడలేదు.

టెండరు నోటీసు

చీరాల మున్సిపాల్టి, చీరాల.

1954-55 లో సప్లయికు గాను ప్రింటింగు, బైడింగు, రూలింగు సంబరింగు వగైరాలకు సీల్డు టెండర్లు 15—7—1954 తేది సాయంత్రము 4 గంటలవరకు శ్రీ కమీషనరుగారిచే తీసికొనబడును. అదే రోజున టెండర్లు సాయంత్రము 5 గంటలకు శ్రీ కమీషనరుగారిచే తెరువబడును. టెండరు దాఖలుదారుడు ధరావతు రు. 50/-లు మున్సిపల్ ట్రెజరీలో చెల్లించవలెను. టెండరుఫారము, టెండరు షెడ్యూల్సు, టెండరు కండిషనులు రు. 0-4-0 లు మున్సిపల్ ట్రెజరీలో చెల్లించిన మీదట పొందవచ్చును. డిపాజిటులేని టెండర్లు త్రోసివేయబడును.

చీరాల, 30-6-54 — పి. నాగభూషణం నాయుడు, మున్సిపల్ కమీషనరు.

సిటీ సివిల్ కోర్టు, మద్రాసు.

O. S. నెం. 1788/1953.

వాదులు: హెచ్. వి. నిజెరాజ్ సౌకార్ కు గాను వారి ఏజెంటు ఎం. పి. హసైబల్.

ప్రతివాదులు: (1) ఎస్. సూర్యనారాయణ మూర్తి, గంగవరం, రామచంద్రాపురం, తూ॥గో॥జిల్లా. (2) డి.వి.డి. ప్రసాదరావు, దంగేరు, రామచంద్రాపురం తాలూకా, తూ॥ గో॥ జిల్లా.

హైయర్ పర్చేజు అగ్రిమెంటు బాపతు బాకీ రు. 2861/- రాబట్టు కొనుటకుగాను ప్రతివాదులపై వేసిన పైదావా 20-7-54 తేది మొదటి అడిషనల్ జడ్జికోర్టులో విచారణకై వాయిదా వేయబడి యున్నది. ప్రతివాదులు హాజరుకానిచో, వారి పరోక్షమున తీర్పు చేయబడును. సి. నటరాజన్, వాది తరపు అడ్వకేటు.



# శ్రీకాకుళం కళాశాలలో బి.ఎ. తరగతులు

## ప్రభుత్వానికి కళాశాల సలహాసంఘం విజ్ఞప్తి

శ్రీకాకుళం, జూన్ 30: శ్రీకాకుళం గవర్నమెంటు ఆర్ట్సు కాలేజీ సలహాసంఘం నిన్న ఉదయం సమావేశమై యీ సంవత్సరం కళాశాలలో బి. ఎ. తరగతులు ఏకనామిక్సు (మెయిన్) తెనుగు (మెయిన్) హిస్టరీస్‌తో ప్రారంభించవలెనని ఆంధ్ర ప్రభుత్వమును కోరుచు తీర్మానించారు.

## కడప కళాశాల

## సైన్సు సెక్షన్‌లో సీట్లు పెంచాలని విజ్ఞప్తి

కడప, జూన్ 30. గవర్నమెంటు ఆర్ట్సు కళాశాల విద్యార్థుల తలితండ్రులు యీ వారంలో శ్రీ ఎ. ఎస్. నారాయణరావుగారి అధ్యక్షతన సమావేశమై, కళాశాలలోని ఇంటర్మీడియేట్ తరగతిలో నాచురల్ సైన్సు సెక్షన్ (II గ్రూపు)లో సీట్లు హెచ్చించాలని, అధికారులను కోరుటకు తీర్మానించారు. అధికారులను స్వయంగా కలుసుకొని విన్నవించేందుకు అధ్యక్షునికి అధికారమిచ్చారు.

ఇప్పటికి 200 మంది విద్యార్థులు II గ్రూపుకోసం దరఖాస్తులు పెట్టారని తెలుస్తున్నది. కాబట్టి కొంతవరకైనా విద్యార్థులను సంతృప్తి పరచేందుకు సైన్సు సెక్షన్‌లో సీట్లు పెంచుట అవసరం. అందుకు తక్షణం చర్యతీసుకోవాలి" అని అధ్యక్షులు నారాయణరావుగారన్నారు.

జిల్లా కాంగ్రెసు ప్రముఖుడు శ్రీ గాజులపల్లె వీరభద్రరావుగారి మృతికి సంతాపం తెలుపుతూ సభలో తీర్మానించారు. వీరభద్రరావు కొంతకాలం ఆంధ్రపత్రిక విలేఖరిగా గూడా పని చేశారు.

## ప్రభుత్వ ఉత్తరువులు

కర్నూలు, జూలై 2: ఈ క్రింది ప్రాంతాలకు సంబంధించిన జిల్లా కలెక్టర్లు ఇచ్చే అనుమతులలోని నిబంధనల ప్రకారం తప్ప, మరేవిధంగాను ఆయా ప్రాంతాలకు ఎవరుపడితే వారు స్వేచ్ఛగా వెళ్ళరాదని నిషేధిస్తూ ఆంధ్ర ప్రభుత్వం ఉత్తరువులిచ్చింది:

ఆ ప్రదేశాలు ఇవి: చిత్తూరు, విజయవాడ, నెల్లూరు, విశాఖపట్టణం, విజయనగరములలోని టెలిఫోన్ ఎక్స్ఛేంజి కార్యాలయాలు; గోదావరి రైల్వే బ్రిడ్జి, కృష్ణా రైల్వే బ్రిడ్జి; విజయవాడ విద్యుచ్ఛక్తి ఉత్పాదక కేంద్రం; విజయవాడలోని టెలిగ్రాఫ్ ఆఫీసు, కారియర్ రిపీటర్ స్టేషను నెల్లూరు కారియర్ రిపీటర్ స్టేషను; విశాఖపట్టణం విద్యుచ్ఛక్తి కేంద్రం, విశాఖపట్టణం సౌకర్యాలు; విజయనగరం తంతితపాలా కార్యాలయం; కర్నూలులోని పోలీస్ రేడియో కార్యాలయం.

## కొల్లేరు భూముల కౌలు విధాన వివరణ

కర్నూలు, జూలై 2: కొల్లేరు భూముల కౌలు నిబంధనలలో కొత్త పరతు అనే శీర్షికన ఈజూలై మొదటి తేదీ ఆంధ్రపత్రిక 2వ పేజీలో వెలువడిన వార్త మొదటి పేరాలో కొల్లేరు భూములనే ప్రభుత్వం తీసుకునే అవకాశం వున్నదన్న భావం వున్నది, అదిసరికాదు. అభూముల పంపిణీకార్యక్రమాన్ని కౌలుదార్లవద్ద నుంచి తీసుకొనే విషయం ప్రభుత్వం వారి ఆలోచనలో వున్నది.

## మార్టేరు భూమి తనఖా బ్యాంకు

నరసాపురం, జూన్ 30: స్థానిక భూమి తనఖా బ్యాంకు డైరక్టర్లనుండి అవడ్డి వెంకటస్వామినాయుడు అధ్యక్షులుగను, ఆవోనూరి గంగాధరం ఉపాధ్యక్షులుగను, శ్రీ కళా సత్యనారాయణ కోశాధికారి గను ఎన్నికైనారు.

## కంతేరువద్ద లారీ ప్రమాదం

మంగళగిరి జూలై 1: మొన్న సాయంత్రం కంతేరువద్ద, గుంటూరు వెడుతున్న లారీ ఒకటి రెండుపల్టీలు కొట్టి క్రిందపడి పోయినందున లారీ డ్రైవరు వెంటనే మరణించాడు. లారీలో ఉన్న యిద్దరికి ప్రమాదకరమైన గాయాలు తగిలినవి. స్పృహలేని స్థితిలో వారిని గుంటూరు జనరల్ ఆస్పత్రికి తీసుకొని వెళ్ళారు.

## మద్రాసులో వనమహోత్సవం

మద్రాసు, జూలై 2: మద్రాసు ముఖ్య మంత్రి కె. కామరాజనాడారు గారు నిన్న సాయంత్రం త్యాగరాయ నగరంలో వనమహోత్సవ వారాన్ని, ఎరువుల వారాన్ని ప్రారంభించారు. మద్రాసు మేయరు ఆర్. మునుస్వామి పిళ్లేగారు స్వాగతమిచ్చారు. మద్రాసు ముఖ్య మంత్రి మాట్లాడుతూ మంచి చెట్లు లేకుండా చెట్లను నరకరాదనీ, వృక్షాలను పెంచి రక్షించాలనీ కోరారు. ముఖ్య మంత్రి ఒక మొక్కను నాటారు.

మద్రాసు వ్యవసాయ మంత్రి ఎం. భక్తవత్సలంగారు వనమహోత్సవ వార సందర్భాన విజ్ఞప్తిచేస్తూ ప్రజలంతా సహకరించాలన్నారు.

# తిరుపతి వేదప్రబంధ ఆగమతరగతులు

## తిరుమలకు మార్చ నీయరాదని విజ్ఞప్తి

తిరుపతి, జూన్ 27: శ్రీ భాగవత రామానుజ సిద్ధాంత సంప్రదాయసభ తరఫున కార్యదర్శి శ్రీ టి. వి. పి. శ్రీనివాసాచారిగారు, యిక్కడికివచ్చిన ఆంధ్రప్రభుత్వ దేవాదాయ మత దాయశాఖ కమీషనరుగారిని సందర్శించి, వేదప్రబంధ ఆగమతరగతులను, తిరుమలకు మార్చరాదని దేవస్థానం వారిని ఆదేశించాలని, ఆ తరగతులను, యిప్పటిలాగా తిరుపతి నమ్మాళ్వారు ఆలయంలో నిర్వహించుతూ ఉండాలని కోరుతూ ఒక విజ్ఞాపన సమర్పించారు. తిరుమలలో యాత్రీకుల సమర్దం ఎక్కువగా ఉంటుంది గనుక అక్కడ ఆ తరగతులు నిర్వహించడం చాలా కష్టంఅవుతుందని విజ్ఞాపనలో తెలియజేశారు.

# అర్చకులకు ధర్మకర్తలకు ఒడంబడిక

## కొన్ని సందర్భాలలో పునర్విమర్శ అవసరమని కమీషనర్ సూచన

తిరుపతి, జూన్ 28: హిందూ దేవాదాయ ధర్మాదాయసంస్థల కమీషనర్ శ్రీ ఆర్. వెంకటరెడ్డిగారు తిరుమలకు వెళ్ళి నిన్న యిక్కడికి వచ్చారు. పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ అర్చకులకు, హిందూ దేవాదాయ ధర్మాదాయసంస్థల యజమానులకు దేవాలయ భూములపై ఆదాయం పంపిణీ గురించి కుదిరిన ఒడంబడిక ఎలా పనిచేస్తుందీ దేవాదాయ ధర్మాదాయశాఖ జాగ్రత్తగా పరిశీలిస్తుందనీ, ఈ ఒడంబడిక కొన్ని సందర్భాలలో అట్టే ఉపయోగంగా లేనట్లు తెలియవచ్చిందనీ, అలాంటి కేసుల పునర్విమర్శించి, మరీ నిర్ణయంచేస్తామని, రెడ్డిగారు చెప్పారు. వారు ఈ సాయంత్రం మద్రాసు వెళ్లారు.

# తిరుపతి దేవాలయంలో చోరీ

## సొత్తుతో సహా దొంగ అరెస్టు

తిరుపతి, జూన్ 28: ఇక్కడ శ్రీ గోవిందరాజస్వామి ఆలయంలో గత రాత్రి చోరీ జరిగింది. గర్భాలయాన్ని అనుకొని ఉన్న గది తాళం బ్రద్దలు కొట్టి డబ్బుఉన్న పెట్టెల దొంగిలించుకొని పోయాడు.

ప్రాకారంలోని తిరుమంగ ఆల్వార్ ఆలయం ప్రక్కనే ఉన్న విగ్రహంచాటున దొంగ దాగుకొని శాగా ప్రొద్దుపోయిన తరువాత దొంగతనానికి ఉపక్రమించాడని, తన పని పూర్తి చేసుకొని ఆలయ ప్రాకారం దాటి పారిపోయాడని చెప్పబడుతున్నది.

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఫిర్యాదుపై తిరుపతి సర్కిల్ ఇన్‌స్పెక్టరు ఆర్. నరసింగభాన్‌రెడ్డి గారు తమ సిబ్బందితో, సమీపమందున్న అడవిలో ఒక యింటిపై దాడి చేసి దొంగను అరెస్టుచేసి చోరీ డబ్బు యావత్తు స్వాధీనం చేసుకొన్నారు. చోరీయైన డబ్బు, వెండి సామాను అంతా కలసి 850 లు ఉంటుందని తెలిసినది. అరెస్టయిన వ్యక్తి పాత నేరస్థుడని తెలుస్తున్నది. కేసు దర్యాప్తు చేస్తున్నారు. (స్వ. వి.)

# వనమహోత్సవం

## పంజాబ్‌రావ్ దేశముఖ్ ఉద్బోధ

జైపూర్, జూలై 1: పచ్చటి మొక్కలని పెరగకుండా నాశనంచేసి, తద్వారా ప్రకృతిలో పౌష్టిక పదార్థాన్నే హరింపచేయడం మానవ జాతిని నశింపచేయడానికి దారి తీస్తుందని, కేంద్ర వ్యవసాయ శాఖ మంత్రి డా॥పంజాబ్‌రావ్ దేశముఖ్ నేడిక్కడ పంచమ వనమహోత్సవాన్ని ప్రారంభిస్తూ హెచ్చరిక చేశారు.

ప్రపంచంలో జీవకోటికి లభించే శక్తి యావత్తు మొక్కలలో ఉండే పౌష్టిక పదార్థం (క్లోరోఫిల్) నుంచే వస్తుందనీ, ఈ అంశాన్ని సామాన్య ప్రజలు కూడా గుర్తించుతున్నారనీ ఆయన అన్నాడు.

మనుష్యుడు, అతడి నాగలి, అతడి పశువులూ వృక్షజాతికి హిందూస్థాన్ మైదానాలలో చేస్తున్నంత అపకారం మరెక్కడా చెయ్యటం లేదనీ, వంట చెఱకు కూడా చెట్లు లేనందువల్ల ఆవుపేడను ఉపయోగించవలసిన దురవస్థ పట్టిందన్నారు.

దూరదృష్టి లేకుండా పశువుల బీళను గ్రామకంఠాలనూ, చిట్టడవులనూకూడ వ్యవసాయ భూములుగా మార్చడంవల్ల భూసారం నశించి, ఫలసాయం తగ్గిపోతున్నదని ఆయన అన్నారు.

వ్యవసాయ భూములవద్ద సుమ్మ చెట్లను పెంచడం చాలా మంచిదనీ, అది ఏటేటా చౌకగా కలప లభింపచేస్తుందనీ ఆయన అన్నారు.

# ప్రయివేట్ కాలేజీలకు విరివిగా సహాయం

## హైద్రాబాద్ విద్యా మంత్రి అభ్యర్థన

హైద్రాబాదు, జూలై 2: ప్రయివేటు సంస్థల ఆధ్వర్యంలో నడుపబడే రాష్ట్రంలోని కొత్త కళాశాలలకు విరివిగా సహాయంచేయవలసిన ఆవశ్యకతను కేంద్ర విద్యామంత్రి మౌలానా ఆజాద్‌కు వివరించామని హైద్రాబాద్ విద్యా మంత్రి శ్రీ గోపాల్ రావ్ ఎక్బోటె తెలియజేశారు.

మంత్రి గోపాల్ రావ్ ఎక్బోటే గారుఢిల్లీ నుంచి ఇవాళ ఇక్కడికి తిరిగి వచ్చారు.

రాష్ట్రంలోని ప్రాథమిక, పాఠశాలలను బేసిక్ పాఠశాలలుగా నూ, హైస్కూళ్ళను సకలార్థసాధక పాఠశాలలుగానూ మార్చటానికి రాష్ట్రప్రభుత్వానికి సహాయంచెయ్యాలని కేంద్రాన్ని అభ్యర్థించామన్నారు. (స్వ. వి.)

# 2లక్షల ఎకరాల్లో జపాన్ వరిసాగు

## హైద్రాబాదు ప్రభుత్వ నిర్ణయం

హైద్రాబాదు, జూలై 2: ఈవిడాది దాదాపు రెండు లక్షల ఎకరాల విస్తీర్ణాన్ని జపాను వరిసాగు పద్ధతిక్రిందకు తేవటానికి హైద్రాబాదు ప్రభుత్వం నిశ్చయించిందని యివాళ తెలియవచ్చింది.

గత సంవత్సరం 1,44,000 ఎకరాలలో ఈ పద్ధతిని వరిసాగు చెయ్యటం, ఎకరానికి 1000 నుంచి 5000 పౌనుల వరకు పంటపెరగటం జరిగింది. స్వ. వి.

# కుటుంబ ఆర్థిక వ్యవస్థా పరిశీలన

హైద్రాబాదు, జూలై 2. ప్లానింగ్ కమీషన్ పరిశోధనా కార్యక్రమాల కమిటీవారు హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాల సర్వేలను యిండియన్ ఇకనామిక్సు ఇన్‌స్టిట్యూట్‌కు అప్పగించారు. ఈ సర్వేనిమిత్తం 7 వేల కుటుంబాలకుపైగా ఉదాహరణగా ఎన్నుకుంటారని భావించబడుతోంది. ఇండియన్ ఇకనామిక్సు ఇన్‌స్టిట్యూట్ డైరక్టరు ప్రొఫెసర్ యస్. కేశవ అయ్యంగార్, హైద్రాబాదుప్రభుత్వ ఇకనామిక్సు స్టాటిస్టిక్సు బ్యూరో డైరక్టరు ఎం. వి. దివాతియాగారలు, తదితరులు ఈ సర్వే కార్యక్రమంలో పని చేస్తున్నారు. (స్వ. వి.)

# అముద్రిత సంస్కృత ఉద్గ్రంథాలప్రచురణ

## హైద్రాబాద్ ప్రభుత్వం 15 వేల రూపాయల మంజూరు

హైద్రాబాదు, జూలై 2: "ఉస్మానియా విశ్వకళాపరిషత్తు ఇటీవల స్థాపించిన సంస్కృత అకాడమీ ఈ ఏడాది రెండో, మూడో ప్రచురణకాని సంస్కృత ఉద్గ్రంథాలను ప్రచురిస్తుంది. అందుకు గాను రాష్ట్రప్రభుత్వం 15 వేల రూపాయలు మంజూరు చేసింది. విశ్వవిద్యాలయం వారు అంతే మొత్తాన్ని ఈ ప్రచురణకు ఇస్తారు" అని హైద్రాబాద్ ముఖ్య మంత్రి బూర్గుల రామకృష్ణరావుగారు ఇవాళరాత్రి ఇక్కడ వెల్లడించారు.

పార్టీ స్వాధ్యాయ మండలి అధ్యక్షుడు పండిట్ శ్రీపాద దామోదర సత్వాలేకర్ గారి సన్మానసభకు అధ్యక్షతవహిస్తూ రామకృష్ణరావుగారు సంస్కృతంలో ప్రసంగిస్తూ కాశ్మీరు, తదితర ప్రదేశాలనుంచి, అకాడమీ ప్రచురించటానికి అపురూపమైన సంస్కృత వ్రాతప్రతులను తెప్పించటానికి తాము ప్రయత్నిస్తున్నామన్నారు.

ఈ పండిత సన్మానాన్ని సంస్కృతభాషా ప్రచారసమితి, తదితర ప్రజా సంస్థలు ఏర్పాటుచేశారు.

86 ఏళ్ల వృద్ధపండితుడు సత్వాలేకర్ సమాధానమిస్తూ దేశంలోని ప్రజలకు జీవితంపైగల దృక్పథంలో మార్పు రావాలనీ, పేదవాణిని తిరిగి ఆకలింపు చేసుకోవాలనీ విజ్ఞప్తిచేశారు.

# స్పిన్నింగ్, వీవింగ్ మిల్లు కార్మికులు

## మంత్రి శ్రీ మెల్కోటె వివరణ

హైద్రాబాదు, జూలై 2: హైద్రాబాద్ స్పిన్నింగ్, వీవింగ్ మిల్లు వ్యవహారాన్ని గురించి మంత్రి డాక్టర్ మేల్కోటే మా విలేఖరితో మాట్లాడుతూ ఈసమస్యను సంతృప్తికరంగా పరిష్కరించటానికి తాము సాయశక్తులా ప్రయత్నిస్తున్నామన్నారు.

ఫ్యాక్టరీ మూసివేయబడటం వల్ల మూతపడిన ... పాటు ప్రభావితం ... కార్మికులు హక్కులుకలిగి ఉంటారు.

# సింహళంలో పౌరసత్వ సమస్య

## భారత ప్రభుత్వ సూచనలకు ఆమోదం

కొలంబో, జూలై 1: రిజిస్ట్రేషను ద్వారా పౌరసత్వం పొందినవారినీ పారంపర్యా పౌరసత్వం పొందినవారినీ వేరుచేసే అంశాలను సింహళ రాజ్యాంగ సవరణ ప్రతిపాదనలనుండి తొలగించడానికి సింహళప్రభుత్వం నిశ్చయించిందని తెలుస్తోంది. పరంపరగా పౌరసత్వం పొందినవారు, రిజిస్ట్రేషనుద్వారా పౌరులైనవారికి నియోజకవర్గాలనుంచీ వారు వారి నియోజకవర్గాలనుంచి ఎన్నికలకు పోటీచేయరాదని, కోరే క్లాజులను సవరణ ప్రతిపాదనలనుంచి తొలగించడానికి నిర్ణయమైంది.

భారతప్రభుత్వం ఇటీవల చేసిన కొన్ని సూచనలకు అనుగుణంగా ఈ నిర్ణయం జరిగిందని తెలుస్తోంది.

ప్రధాని కొటేలవలా గతవారం సి. సి. దేశాయితో జరిపిన చర్చలలోనే, దీనికి సూత్రప్రాయంగా అంగీకరించారు. నేడు మంత్రివర్గ సమావేశంలో ఆయనే ఈ సూచన చేశారు.

ప్రత్యేక నియోజక వర్గాలను ఏర్పరచే సదిసంవత్సరాలపరిమితి విషయంలో కూడా సింహళం ఇండియాల మధ్య సామరస్యం అంగీకారం ఏర్పడిందని తెలుస్తోంది.

ఇప్పటి బిల్లుప్రకారం ప్రత్యేక నియోజక వర్గాలు 1967 వరకూ ఉండాలి. అప్పటికి మూడవజనరల్ ఎన్నికలుజరుగుతవి కాబట్టి, అంత వ్యవధి ఉండరాదని ఇండియాకోరిన మీదట, 1966 జనవరి 1వ తేదితో ప్రత్యేక నియోజక వర్గాలు రద్దు అయ్యేవిధంగా సవరణ చేయడానికి సింహళ మంత్రి వర్గం నిర్ణయించిందని తెలుస్తుంది.

కొత్తగా పౌరసత్వం పొందనున్నవారికి కేటాయించే స్థానాలు 4 నుంచి 6వరకూ పెంచాలని, ఎన్ని స్థానాలు ఉంటే అన్ని నియోజక వర్గాలు ఏర్పరచాలనీ భారత ప్రభుత్వం చేసిన రెండు సూచనలకు మాత్రం సింహళం అంగీకరించ లేదని తెలుస్తోంది.

# గీతపనివారల శాసనోల్లంఘనం

## విజయవాడలో నలుగురి అరెస్టు

విజయవాడ, జూలై 2: మద్యనిషేధ శాసనోల్లంఘనం సందర్భంలో, యీ మధ్యాహ్నం పోలీసులు, నలుగురిని అరెస్టుచేశారు.

రాష్ట్ర శాసనసభ కృషికార్ పార్టీ నాయకుడు గీతపనివారల కార్యాచరణ సంఘాధ్యక్షుడునగు శ్రీ గౌతు లచ్చన్న గారి నాయకత్వాన బాజీ గీతపనివారల ఊరేగింపు బయలుదేరి, తాలూకా ఆఫీసు గేట్లవద్ద ఆగిపోయింది. ఆ తరువాత నలుగురు స్టేషనరీ సబ్ మేజిస్ట్రేట్ కోర్టులో పికెటింగు చేసేందుకు కోర్టులోకి వెళ్ళారు. కోర్టులో అల్లరిచేసినందుకు ఆ నలుగురిని వెంటనే అరెస్టు చేసి రిమాండులో ఉంచారు.

## విజయవాడలో అరెస్టులు

(ఆంధ్రపత్రిక విలేఖరి)

విజయవాడ, జూలై 2: పంది సాంబయ్య, కామినేని చిన్నస్వామి మట్టా స్వామి, దొంతకాని ఆదెయ్య అను వారలు ఇవాళ సాయంత్రం 4గం.లకు స్టేషనరీ సబ్ మేజిస్ట్రేటు కోర్టు దగ్గిర గీతపనివారల పక్షాన మద్యనిషేధం రద్దు కావాలని సత్యాగ్రహంచెయ్యగా అరెస్టు చేయబడ్డారు. గౌతులచ్చన్న గారు ఊరేగింపుతో గేటుదాకా వచ్చారు.

## అనకాపల్లి పురపాలక సంఘం

అనకాపల్లి, జూన్ 28: మొన్న సోమవారం సాయంత్రం ఈపురపాలక సంఘ సాధారణ సమావేశంలో ఇక్కడ ఉన్న రెండు హైస్కూళ్ల అభివృద్ధిని చర్చించి, ఒక హైస్కూలులో ఫోటు చాలనందున అదనంగా వచ్చిన విద్యార్థులను గవరపాలెం హైస్కూలుకు మార్చవలెనని, హెడ్మాస్టరుగారి సూచనను అంగీకరిస్తూ తీర్మానించారు.

సమావేశానికి చైర్మన్ శ్రీ దాడివీరు నాయుడుగారు అధ్యక్షతవహించారు.

శారదా గ్రంథాలయం గోడను సిమెంటు చేయుటకు 24 వేల గూ. ల అంచనా తాలూకు పని ప్రారంభించాలని, ఈ రోడుకు అయ్యే ఖర్చులలో సగం గ్రాంటుగా యివ్వాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు.

పన్నులశాఖ పని హెచ్చినందున అదనంగా కొంత సిబ్బందిని వేయాలని కమీషనరుగారు చేసిన సూచనను చర్చించి, బడ్జెట్‌లో కొత్త సిబ్బందికి డబ్బు కేటాయించ లేదని త్రోసి పుచ్చారు.

## కేంద్ర బాయిలర్సు బోర్డు

కర్నూలు, జూలై 2: బాయిలర్స్ ఇన్‌స్పెక్టరూ, బాయిలర్స్ ఛీఫ్ ఇన్‌స్పెక్టరుకు పర్సనల్ అసిస్టెంటుఅయిన వి. వి. కామత్ గారి కేంద్ర బాయిలర్సు బోర్డుకు ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ ప్రతినిధిగా ప్రభుత్వం నియమించింది.

పశ్చిమగోదావరిజిల్లా ప్రజాసోషలిస్టుపార్టీవారి జనరల్ కౌన్సిలు కార్యవర్గ సభ్యుల ... 12వ తేదీన ... జరుగుతుందని కార్యదర్శి శ్రీ ఎర్రమిల్లి నరసింహారావుగారు తెలుపుతున్నారు.

# భూదానసమితికృషి

## 34 లక్షల ఎకరాల సేకరణ

హైద్రాబాదు, జూలై 2: 1951 జూన్‌లో తెలంగాణాలో ప్రారంభోత్సవం జరిగిన నాటినుంచి నేటి వరకూ దేశవ్యాప్తంగా భూదానసమితి 34 లక్షల ఎకరాలకుపైగా భూమిని సేకరించిందని స్థానిక సమితి ఇవాళ ఇక్కడ తెలియజేసింది.

ఈ మొత్తంభూమిని 8 లక్షలకు పైగా దాతలు ఇచ్చారు. ఇంతవరకు సమితి దేశం మొత్తంమీద 65 వేల ఎకరాలను 18 వేల కుటుంబాలకుపైగా పంచిఇచ్చింది.

గయ సమితి కార్యకర్తల శిక్షణకు ఒక కేంద్రాన్ని స్థాపించబడలచింది. మూడునెలల శిక్షణ గరపబడుతుంది.

హైద్రాబాద్ సమితి ఇంతవరకు ఒకలక్ష ఎకరాలకుపైగా సేకరించింది.

# బస్సు అటకాయింపు కేసులు

కర్నూలు, జూలై 2: ఈ క్రింద వివరించబడిన బస్సు అటకాయింపు కేసులను విచారించే ప్రత్యేక స్టేషనరీ మేజస్ట్రేట్‌గా కృష్ణాజిల్లా సెకండ్ క్లాస్ మేజస్ట్రేట్ జె. వెంకటరావ్ గారిని నియమిస్తూ ప్రభుత్వం ఉత్తరువులు ఇచ్చింది. ఈ ప్రత్యేక స్టేషనరీ మేజస్ట్రేట్ విజయవాడలో ప్రధాన కార్యాలయం ఏర్పరచుకొని ఈ క్రింది కేసులను విచారిస్తారు (1) గుడివాడ తాలూకా స్టేషనుకు చెందిన 1953వ సంవత్సరపు 12 నుంచి 14 నంబరు కేసులు.

(2) విజయవాడ తాలూకా స్టేషనుకుచెందిన 1953వ సంవత్సరపు 64 నుంచి 68 నంబర్ల కేసులూ 71, 72 కేసులూ, విజయవాడలా అండ్ ఆర్డరుకుచెందిన 585వ నంబరు కేసూ (3) తాడేపల్లి గూడెం పోలీసుస్టేషనుకు చెందిన 1953వ సంవత్సరపు 169 నుంచి 172 నంబర్ల కేసులు.

(4) గూడూరు పోలీసుస్టేషనుకు చెందిన 1953వ సంవత్సరపు 15వ నంబరు కేసూలు.

# కర్నూలుజిల్లా కాంగ్రెస్ అధ్యక్షుని ప్రకటన

కర్నూలు, జూలై 2: కర్నూలు జిల్లాకాంగ్రెసుఅధ్యక్షుడు పెండేకంటి వెంకట సుబ్బయ్యగారు ఇలా ప్రకటిస్తున్నారు:

"అఖిలభారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ బలవంతరాయ్‌మెహతా ఈనెల 7వ తేదీన ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష, కార్యదర్శులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, కల్లూరి చంద్రమౌళిగారలతో కలిసి కర్నూలు వస్తారు. ఆరోజు సాయంత్రం నాలుగుగంటలకు ఉస్మానియా కాలేజిలో కాంగ్రెసు కార్యకర్తల సమావేశం జరుగుతుంది. కావున అఖిలభారత కాంగ్రెసు సభ్యులూ, రాష్ట్రజిల్లా కాంగ్రెసు సభ్యులూ, తాలూకా పట్టణకాంగ్రెసు అధ్యక్ష, కార్యదర్శులూ, కాంగ్రెసు శాసన సభ్యులూ, ఇతర కాంగ్రెసు కార్యకర్తలూ సమావేశమునకు హాజరు కాగోరుతున్నాను."

# కృష్ణాజిల్లా ప్రాంతీయ సంఘం

కర్నూలు, జూలై 2: కృష్ణాజిల్లా ప్రాంతీయ సంఘసభ్యులలో ముగ్గురు సభ్యులు ఆ పదవులకు యోగ్యతలు కోలుపోయినందున ఆ మూడు పదవులలో రెండింటికి మిలటరీ ఇంజనీరుగా పనిచేసి విశ్రాంతి తీసుకొంటున్న శ్రీ ఎన్. జి. రాజు (గున్నరాజ సుందర భవనం - విజయవాడ) గారినీ, రిటైరయిన డిప్యూటీకలెక్టరు వై. వి. సుబ్రహ్మణ్యంగారినీ (బకింగ్‌హామ్‌పేట — రామానగరం — విజయవాడ), ఆంధ్రప్రభుత్వం నియమించింది.

# యలమంచిలిలో చోరీ

## 4 వేలరూ. ల. ఆస్తి దోపిడీ

యలమంచిలి, జూన్ 29: ఈనెల తేదీ 26 రాత్రి శ్రీ గుంటూరు వెంకట సుబ్బారావుగారి యింట్లో దొంగలు ప్రవేశించి 80 తులములుపైగా బంగారు వస్తువులను, వెండివస్తువులు మొత్తం రు 4000/లు కిమ్మత్తుగలవి దోచుకొని పోయారు. స్థానిక పోలీసువారికి రిపోర్టు చేయగా డిప్యూటీ సూపరెంటుకూడ విచ్చేసి చోరీ దరియాప్తు చేస్తున్నారు. ఆ చోరీ యింకను వివరము దొరకలేదు.

# ముగ్గురు స్త్రీల దుర్మరణం

## నలుగురికి తీవ్రగాయాలు

అహమదాబాద్, జూలై 2: పనస్కాంత జిల్లాలోని కంథారా అనే గ్రామంలోని ఒక నూతిలో నీళ్లతోడుతున్న ఏడుగురుస్త్రీలు ప్రమాదవశాత్తూ ఒక్కసారిగా ఆ నూతిలో పడిపోయారనీ, అందులో ముగ్గురు స్త్రీలు మరణించారనీ 4 గురు తీవ్రంగా గాయపడారనీ, ఇక్కడికి చేరినవార్తలు తెలుపుతున్నవి.

ఆ నూతిపైన కట్టిన ... విరిగిపోయినందువల్ల ఈప్రమాదం సంభవించిందట.

# జగ్గయ్యపేట పంచాయతీ బోర్డు

## పన్ను అప్పీళ్ల విచారణ ఉపసంఘం నియామకం

జగ్గయ్యపేట, జూన్ 30: స్థానిక పంచాయతీ బోర్డు సభ్యులు యీ మధ్యాహ్నం శ్రీ సామినేని విశ్వనాథం గారి అధ్యక్షతన సమావేశమై వచ్చే సంవత్సరము వృత్తిపన్నులు, యింటిపన్నులు వగైరా అప్పీళ్ళను విచారించుటకుగాను శ్రీ సామినేని విశ్వనాథం (అధ్యక్షుడు) బెంబవరపు నాగేశ్వరరావు (ఉపాధ్యక్షుడు) అగస్త్య దుర్గాప్రసాదరావు, అప్పన వైకుంఠం, జి. వి. ఆర్. సుబ్బారావుగార్లను ఉపసంఘంగా నియమించారు. వై. వై. శర్మ చల్లా వాసుదేవరావు, జి. సూర్య గారలు తమ ఇంట్లముందు యున్న ఖాళీస్థలముకు పన్ను అంచనా కోరగా పంచాయతీవారు తమ హక్కును వదలుకొనుటకు అంగీకరించారు.

1952-53 సం॥ తాలూకు ఆడిటు రిపోర్టును అంగీకరించారు. యీ పంచాయతీ తరఫున 4 రబ్బిషు బండ్లు, 6 యెద్దులను కొనుటకున్ను, బండ్లు తోలుటకు నెల 1కి రు 30/- జీతము పై డ్రైవర్లను యేర్పాటు చేయుటకు నిశ్చయించారు. పంచాయతీ తరఫున తయారుచేయవలసిన పనులకు అంచనాలు తయారుచేసేనిమిత్తం, పంచాయతీ సూపరువైజరును పంపవలసినదిగా జిల్లా పంచాయతీ ఆఫీసరుగారిని కోరుటకు తీర్మానించారు. వినోదపు పన్ను మీద రాబడి తగ్గినందున, టౌన్ ప్లానింగ్ సూపరువైజరు ఉద్యోగం రద్దు చేసి, సదరు స్థానములో 3వ గ్రేడు టౌన్ ప్లానింగ్ ఇన్‌స్పెక్టరు ఉద్యోగం నెల 1కి రు 50/- అవులలో యున్న స్కేలు ప్రకారం కరువు భత్యం ఇచ్చులాగున నిర్ణయించారు.

# ఆకివీడులో పురమందిరం

## కళాశాల ప్రిన్సిపాలు గారిచే ప్రారంభోత్సవం

భీమవరం, జూన్ 31: ఆకివీడులో కొత్తగా నిర్మింపబడిన పురమందిరమునకు, స్థానిక కళాశాల ప్రిన్సిపాలు శ్రీ ఇ. లక్ష్మీనాథంగారు ప్రారంభోత్సవంచేశారు. భీమవరం సబ్ మేజస్ట్రేటు (జ్యూడిషియల్) జనాబ్ మొహిద్దీన్ ప్రారంభోత్సవ సభకు అధ్యక్షత వహించారు.

పురమందిరం పాలకవర్గమునకు జరిగిన ఎన్నికలలో, అధ్యక్షులుగా పులవర్తి వెంకటసుబ్బారావు (జమీందారు) ఉపాధ్యక్షుడుగా జనాబ్ డా॥ ఎం. ఎ. హై. ప్రధాన కార్యదర్శి జనాబ్ ఎజి. ఖాన్ సహాయ కార్యదర్శులుగా శ్రీ యుతులు ఎం. శేషగిరిరావు, రాజారావు కోశాధిపతిగా శ్రీ ఎల్. ఎస్. శర్మ గారలు ఎన్నికైనారు. పురమందిరం సభ్యులు ప్రొహిబిషన్ సబ్ ఇన్‌స్పెక్టరు శ్రీ కె. వెంకట్రావుగారు తణుకు బదిలీఅయిన సందర్భంలో తేనీటి విందుచేశారు.

# ఎన్. జి. ఓల పిల్లలకు ఉచిత విద్య

## స్థానికసంస్థలకుప్రభుత్వం నష్టపరిహారంయివ్వలేవట

తిరుపతి, జూన్ 29: నాన్‌గజిటెడ్ ఉద్యోగుల పిల్లలకు, తదితరుల పిల్లలకు, ఉచితంగా విద్యాసౌకర్యం కల్పించుటవల్ల స్థానిక సంస్థలకు కలిగే నష్టం పూర్తిగా ప్రభుత్వం యివ్వజాలదని, యీ విషయంలో, యిదివరకటి ఉత్తర్వులను ప్రభుత్వం పునర్విమర్శ చేయ నవసరంలేదని, ఆంధ్రప్రభుత్వం విజయవాడ తిరుపతి మున్సిపాలిటీలకు తెలియపరచింది.

# మంత్రుల కార్యక్రమం

కర్నూలు, జూలై 3: యీనెల 4వ తేదీ ఉదయం ఉపముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారు మోటారుకారులో ఇక్కడినుంచి గుంటూరు వెళతారు. ఆరవతేదీరాత్రి ఇక్కడికి తిరిగివస్తారు. ఏడవతేదీ ఉదయం ద్రోణాచలం వెళ్ళి డాక్టర్ కైలాస్‌నాథ కట్జూగారి వెంట తుంగభద్ర ప్రాజెక్టుకువెళ్ళి అదేరోజు రాత్రి ఇక్కడికి తిరిగివస్తారు.

ఆంధ్ర హైకోర్టు ప్రారంభోత్సవంలో పాల్గొనడానికిగాను రెవిన్యూ మంత్రి కోటిరెడ్డిగారు యీనెల 4వ తేదీ సాయంకాలం ఇక్కడినుంచి బయలుదేరి గుంటూరువెళ్ళి ఆరవ తేదీ ఉదయం ఇక్కడికి తిరిగివస్తారు.



వేలము అమ్మకము

వార్డు నెం. 18/42, త్యాగరాజ వీధి, గూడూరు నందలి ఆంధ్ర బ్యాంకు గోడౌన్సులో నిల్వ వున్న 14,000 పౌనుల బ్లాకు మైకా యున్నూ స్ప్లిటింగులున్ను బహిరంగ వేలములో 8-7-1954 తేదిన మ॥ 2 గంటలకు ముత్రే కంపెనీ, మదరాసు-1 వారిచే బహిరంగ వేలంలో విక్రయింపబడును.

జనరల్ నోటీసు

చోడవరం డి॥ మునసబు కోర్టు

O. P. 17/54.

పిటీషనర్లు: గొర్లె సింహాద్రి వగైరా.

రెస్పాండెంట్లు: యండపల్లి అప్పన్న వగయిరాలు.

పై నెంబరు పిటీషనర్లు యండపల్లి పెద్దన్న భార్య కన్నమ్మకు చామంతుల రాములు 8-8-51 తేదిన వ్రాసిన ప్రోనోటు బాకీ అసలు వడ్డీలు రు. 468 - 4 లు రాబట్టే నిమిత్తం శెక్షను పర్టిఫికేటు యిప్పించమని పిటీషను దాఖలు చేసినారు. అందుకు యెవరికైనా ఆక్షేపణలు వున్నయెడల 12-7-54 తేది వుదయం 10 గంటలకు పై కోర్టువారి యెదుట హాజరై తెలియపర్చుకోవలెను. లేనియెడల మీపరోక్షమందు తీర్మానించబడును.

చోడవరం, 30-6-54. — ఎస్. ఎస్. సోమయాజులు, వాది తరపు ప్లీడరు.

# గ్రామాలలో రోడ్ల అభివృద్ధికి 3 లక్షలు

## ఆంధ్ర ప్రభుత్వానికి కేంద్రం గ్రాంటు

["ఆంధ్రపత్రిక" విలేఖరి]

కర్నూలు, జూలై 3: గ్రామాలలో రోడ్లను అభివృద్ధి చెయ్యడానికిగాను ఆంధ్రప్రభుత్వానికి కేంద్రప్రభుత్వం మూడులక్షల రూపాయల గ్రాంటు మంజూరుచేసింది. బాగా అభివృద్ధి చెందని ప్రాంతాలలో ఎక్కువ [illegible] (ఫీడరు) చిన్నచిన్న రోడ్లను, నిర్వహణకు ఏటేటా అంత ఎక్కువ డబ్బు ఖర్చు చెయ్యవలసిన అవసరంలేని రోడ్లను నిర్మించాలని ఈ స్కీము ఉద్దేశం. మూడు సంవత్సరాలలో ఈ మూడులక్షల రూపాయల గ్రాంటు లభిస్తుంది.

ఈ స్కీముకుగాను అవిభక్త మద్రాసు రాష్ట్రానికి మొదట లక్షరూపాయలను కేటాయించారు. అంతలో మద్రాసు రాష్ట్రం విభజించబడడంవల్ల ఆ లక్షరూపాయలనూ శేషించిన మద్రాసు రాష్ట్రానికి గ్రాంటుగా పరిగణించారు. కనుక ఆంధ్రకు ఇప్పుడు ఈ గ్రాంటు కొత్తగా ఇస్తున్నారు.

ఈ స్కీము ప్రకారం, జనాభా ప్రాతిపదికపై రాష్ట్రంలోని జిల్లాలన్నింటికీ ఈ గ్రాంటులో నూటికి 75 వంతులు పంపిణీ చేస్తారు. మిగతా 25 వంతులనూ రాష్ట్రంలో వెనుకబడిన ప్రాంతాలు, కరువు ప్రాంతాలలో రోడ్ల అభివృద్ధికిగాను (రిజర్వు) ప్రత్యేకంగా వుంచుతారు.

రాష్ట్రప్రభుత్వమూ, ప్రజలూ కూడ విరాళాలు ఇవ్వాలని ఈ గ్రాంటుషరతులలో ఉన్నది. ఈస్కీముప్రకారం జరిగేపనులకు అయ్యేఖర్చులలో కనీసం మూడవవంతును ఆయాప్రాంతాలలోని ప్రజలు రొక్క రూపంలోగాని శ్రమదాన కాయకష్టంరూపంలోగాని వస్తువులసప్లయి రూపంలోగాని విరాళంగా యివ్వాలి. ఇదేవిధంగా రాష్ట్ర ప్రభుత్వంకూడా యీస్కీముకింద జరిగే పనులకు అయ్యే ఖర్చులో మూడవ వంతును విరాళంగా ఇవ్వాలి. అంటే ఈ ప్రణాళికను సక్రమంగా విజయవంతంగా అమలుజరిపితే మూడేండ్లలో గ్రామాలలో రోడ్ల అభివృద్ధికిగాను మొత్తం తొమ్మిదిలక్షల రూపాయలు ఖర్చుపెట్టవచ్చునన్నమాట.

సమాజ వికాస కార్యక్రమాలూ, జాతీయవికాస కార్యక్రమాలూ అమలు జరిగే గ్రామాలకు ఈస్కీముప్రకారం వచ్చే గ్రాంటు లభించదు.

ఆంధ్రప్రభుత్వ హైవేస్ శాఖ చీఫ్ ఇంజనీరు శ్రీ జె. ఎన్. ఫ్రెడరిక్ ప్రత్యక్ష పర్యవేక్షణలో అజమాయిషీలో పనిచేసే డివిజనల్ యింజనీర్లను సంప్రదించి వివిధపనులు జరగవలసిందీ నిర్ణయించి, వాటిని అమలుజరిపే అధికారం జిల్లా కలెక్టర్లకు ఇవ్వబడింది.

స్థానికసంఘాలకూ, ఆయాపనుల వల్ల ప్రయోజనం పొందేవారికీ పనులను ఒప్పగించవచ్చు. వాటిని అమలుజరుపడానికి తగిన సంఘాలను నిర్ణయించే అధికారం జిల్లా కలెక్టరులకు ఇచ్చారు.

జనాభా ప్రాతిపదికపై రాష్ట్రంలోని వివిధ జిల్లాలకు ఈక్రిందివిధంగా ఈగ్రాంటు సొమ్మును కేటాయిస్తారు.

| | రూపాయలు |
|---|---|
| 1. విశాఖపట్టణంజిల్లా | 24,225 |
| 2. శ్రీకాకుళంజిల్లా | 28,625 |
| 3. తూర్పుగోదావరిజిల్లా | 28,300 |
| 4. పశ్చిమగోదావరి జిల్లా | 19,500 |
| 5. కృష్ణాజిల్లా | 19,350 |
| 6. గుంటూరుజిల్లా | 4,650 |
| 7. నెల్లూరుజిల్లా | 27,900 |
| 8. చిత్తూరుజిల్లా | 35,625 |
| 9. అనంతపురంజిల్లా | 28,200 |
| 10. కర్నూలుజిల్లా | 30,675 |
| 11. కడపజిల్లా | 22,050 |

## నెల్లూరు రోటరీక్లబ్బు

నెల్లూరు, జూలై 2: స్థానిక రోటరీ క్లబ్బు వార్షికసమావేశం, విందు మొన్న యేర్పాటు చేయబడినవి. జిల్లాఅధికారులు, పలువురుప్రముఖులు హాజరయినారు. కార్యదర్శి డా॥ ఎం. వి. కృష్ణారెడ్డిగారు గతసంవత్సరం నివేదిక సమర్పిస్తూ, యీ క్లబ్బువారు గోదావరి వరదబాధితుల సహాయార్థం, రాజమండ్రి రోటరీక్లబ్బు అధ్యక్షునికి 500 రు. లు పంపారని, రోటరీ సంచార వైద్యశాలను యేర్పాటుచేసి, వారమునకు ఒకదినము పరిసరగ్రామములలో చికిత్స చేయించడం జరుగుతున్నదని, 500 మందికి చికిత్స చేశారని, నెల్లూరులోని సి. ఆర్. గోపాల బ్రదర్సు లెడర్లి లేబొరేటరీ కంపెనీ లిమిటెడ్ వారు, టి. సి. ఎఫ్. కంపెనీవారు, లెఫ్‌టెట్ కంపెనీవారు, ఈస్టిండియా కంపెనీవారు మొదలగువారు 2వేల రూ. ల మందులు యిచ్చారని, అందువల్ల బీదలకు ఉచితంగా చికిత్స చేయుటకు అవకాశాలు కలిగినవని చెప్పారు.

ఎం. వి. సుబ్రహ్మణ్యంగారు క్లబ్బు (మెడల్ ను) సుందరరామిరెడ్డిగారి మెడలో అలంకరించారు. సుందరరామిరెడ్డిగారు కృతజ్ఞత తెలియజేశారు.

# ద్వితీయ ప్రణాళిక

## ప్రజావసరాలపట్ల కాంగ్రెస్ శ్రద్ధ

### శ్రీ అగర్వాల్ లేఖ

న్యూఢిల్లీ, జులై 2: వచ్చే పంచవర్ష ప్రణాళికలో ప్రజలభావాలు, అవసరాలు ప్రతిఫలించేటట్లు చూడ్డానికి ప్రతిరాష్ట్ర కాంగ్రెస్ సంఘము, తన క్రింది కాంగ్రెస్ సంఘాలవారిచేత ఈ ప్రణాళికలో ఏయే పథకాలు, కార్యక్రమాలువుండటం అవసరమనుకుంటున్నాయో తయారు చేయించవలసిందిగా కోరుతూ అ॥ భా॥ కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ ఎస్. ఎన్. అగర్వాల్ అన్ని రాష్ట్రాలలోని కాంగ్రెస్ సంఘాలకు ఉత్తరాలు వ్రాశారు.

ఈ ముఖ్య సిఫార్సులను రాష్ట్ర కాంగ్రెస్ సంఘాలు ఎట్లా తయారు చేయ్యాలో వివరిస్తూ, ఈ జిల్లా కాంగ్రెస్ సంఘాలు రెండో పంచవర్ష ప్రణాళిక ఎట్లావుండాలో, అందులో ఏయే కార్యక్రమాలు వుండాలో సూచిస్తూ రాష్ట్ర కాంగ్రెస్ సంఘాలకు తమ సిఫార్సులను అందజెయ్యాలి. రాష్ట్ర కాంగ్రెస్ సంఘాలు, యీ సిఫార్సుల నన్నింటిని పొందుపరచి, ప్రణాళిక ఫలవంతంగావుంటే బాగుంటుందని సూచిస్తూ రాష్ట్రప్రభుత్వాలకు ఒక పథకాన్ని అందజేసి, దానికాపీని ఏ. ఐ. సి. సి. కి పంపించాలి అని శ్రీ అగర్వాల్ ఆదేశించారు.

ఈ ముఖ్య సిఫార్సులను తయారు చేయడంలో ఈక్రింద అంశాలను కాంగ్రెసు సంఘాలన్నీ దృష్టిలో వుంచుకోవాలి. (1) మొదటి పంచవర్ష ప్రణాళికలో పెద్ద పెద్ద ప్రాజెక్టులకు, పెద్ద పెద్ద పరిశ్రమలకు ప్రాముఖ్యం ఇవ్వబడింది. ఇక రెండో ప్రణాళికలో లఘు పరిశ్రమలకు, గ్రామ పరిశ్రమలకు కుటీర పరిశ్రమలకు ప్రాధాన్యం ఇవ్వాలి. అట్లాచేస్తే నిరుద్యోగ సమస్య కొంతవరకు తీరుతుంది. (2) పల్లెపట్టులలో మంచి నీటివసతులు సరిగ్గలేవు. ఆ విషయాన్ని గురించి ఈ ప్రణాళిక శ్రద్ధవహించాలి. (3) గ్రామాలను పట్టణాలతో కలిపే రోడ్లు ఇప్పుడుచాలా తక్కువగావున్నాయి. అట్టి రోడ్ల నిర్మాణానికి ఈ ప్రణాళికలో ప్రాధాన్యం ఇవ్వాలి. ఇప్పుడు ఈ రోడ్ల నిమిత్తం కేటాయిస్తున్న డబ్బంతా పట్టణాల్లో రోడ్లకు తారు వెయ్యడంకోసం వినియోగిస్తున్నారు. అట్లా దుర్వినియోగం అవుతున్న డబ్బును, ఈ రోడ్లను నిర్మించి సద్వినియోగం చెయ్యవచ్చు. (4) బేసిక్ పాఠశాలలను, సర్వార్థసాధక సాంకేతిక పాఠశాలలను ప్రత్యేకంగా నెలకొల్పాలి. (5) గ్రామాలలో తంతి తపాలా శాఖలను యెక్కువ చెయ్యాలి. (6) గ్రామ ఆస్పత్రులు నిర్మించి, వైద్యశాలలను ఎక్కువ చెయ్యాలి. (7) జనపదాలలో మైనరు ఇరిగేషన్ పనులు ప్రారంభం చేయడానికి వీలుగా సర్వేలు ఆర్వీ(?) చేయించాలి. (8) దేశం ఆర్థిక, రాజకీయ వ్యవస్థల వికేంద్రీకరణానికి ఎట్టి కార్యక్రమాన్ని అనుసరిస్తే బాగుంటుందో సూచించాలి.

## ఆర్యవైశ్యమహాసభ

గుంటూరు, జూన్ 29: ఆర్యవైశ్య మహాసభ కేంద్ర సభ్యుల సమావేశము శ్రీ తుమ్మలపల్లి వీరభద్రరావుగారి అధ్యక్షతన నిన్న శ్రీ ముద్దు సుదర్శనము గారిభవనములో జరిగినది. సమావేశమునకు వివిధ జిల్లా సభ్యులు విచ్చేసినారు. నూతన సంవత్సరమునకు అధ్యక్షులుగ శ్రీ తుమ్మలపల్లి వీరభద్రరావు గారిని ఉపాధ్యక్షులుగ శ్రీయుతులు ఎన్. విరూపాక్షశెట్టి, చేవలి రామమోహనరావు, ముద్దు సుదర్శనము, గుంటూరు నరసింహారావు, అన్నవరపు సుబ్బారావు పుష్పగార్లు, శ్రీమతి కె. కె. తాయారమ్మగారు ప్రధాన కార్యదర్శిగ శ్రీ అట్లపల్లి సర్విశ్రేష్ఠిగారు సంయుక్త కార్యదర్శులుగా శ్రీయుతులు త్రిపురనేని లక్ష్మయ్యగుప్త, మాచర్ల పున్నయ్యగార్లు పదహారు మంది సభ్యులతో కార్యనిర్వాహక వర్గమొకటి ఏకగ్రీవముగా యెన్నుకొన్నారు. కొన్ని తీర్మానములు గావింపబడిన అనంతరము శ్రీ ముద్దు సుదర్శనం గారు ఇచ్చిన ఫలహార విందుతో సమావేశము ముగిసినది.

శ్రీ కన్యకాపరమేశ్వరి దేవస్థానములో జరిగిన పురవైశ్యుల సభకు శ్రీ దొంతుకూరి పుల్లేంద్రగుప్తగారు అధ్యక్షత వహించారు. వైశ్యులు రాజకీయములు, విద్యాసంస్థలు, హాస్టళ్ళు, వైశ్యసంఘాల ఆవశ్యకతను గూర్చి శ్రీయుతులు తుమ్మలపల్లి వీరభద్రరావు, శిఖాకోళం పట్టాభి రాములుగుప్త, పోలిశెట్టి ఆదినారాయణగుప్త, గంధి వెంకటలింగం, అట్లపల్లి సర్విశ్రేష్ఠి గార్లు శ్రీమతి చిట్టూరి రంగవల్లి తాయారమ్మగార్లు ఉపన్యసించారు. శ్రీ త్రిపురమల్లు లక్ష్మయ్య గుప్తగారు వందన సమర్పణలో సభ ముగిసింది.

శ్రీ తుమ్మలపల్లి వీరభద్రరావుగారి గౌరవార్థం విందుచేశారు.

# సంయుక్త మహారాష్ట్ర, ఐక్య కర్ణాటక, విశాలాంధ్ర నిర్మాణం

## హైద్రాబాద్ ప్రజలు ముక్తకంఠంతో ఎలుగెత్తి చాటాలని శ్రీ నిజలింగప్ప ఉద్బోధ

హైద్రాబాదు, జులై 2: "హైద్రాబాదు రాష్ట్రాన్ని విడగొట్టవలసిన ఆవశ్యకతను హైద్రాబాదుప్రజలు ముక్తకంఠంతో ఎలుగెత్తిచాటి, సంయుక్త మహారాష్ట్ర, ఐక్యకర్ణాటక, విశాలాంధ్రరాష్ట్రాలు అద్యతనభావిలో ఏర్పడేటందుకు దోహదం చెయ్యండి" అని హైద్రాబాద్ పబ్లిక్ వర్క్సు మంత్రి డాక్టర్ జి. ఎస్. మేల్కోటే గారికి ఒక లేఖవ్రాస్తూ కర్ణాటకరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ ఎస్. నిజలింగప్పగారు ఉద్బోధించారు.

శ్రీ నిజలింగప్ప ఇంకా ఇలా వ్రాశారు:

"హైద్రాబాద్ ప్రజలు ఇలాచేయని పక్షంలో భాషారాష్ట్రాల నిర్మాణ లక్ష్యసిద్ధికి కొన్నేళ్లు పడుతుంది.

"హైద్రాబాద్‌లోని కొంతమంది ఆంధ్రనాయకులు ప్రత్యేక తెలంగాణా రాష్ట్రాన్ని కోరవచ్చు. కాని, మహారాష్ట్రులు, కన్నడుగులు అంతసంకుచితంగా ఎన్నడూ తలంచియుండరు. వీరికి ఓకేరాష్ట్రం కావాలి.

"హైద్రాబాద్ ప్రదేశ కాంగ్రెసు కర్ణాటక ప్రతినిధులు ఐక్యకర్ణాటక రాష్ట్రంలో వెనుకపడిన తమకు ప్రాధాన్యత నివ్వాలన్న భావాలతో నేను ఏకీభవిస్తున్నాను. బాగా అభివృద్ధిపొందిన మైసూరుజిల్లా, కూర్గు, కొంతవరకు మైసూరు, బొంబాయిప్రాంతాల అభివృద్ధికి దెబ్బ తగలనివిధంగా కర్ణాటంలోని తదితర వెనుకపడినప్రాంతాల అభివృద్ధికి ప్రాధాన్యత ఇవ్వటం అవసరమే. హైద్రాబాద్‌లోని కర్ణాటక ప్రాంతాలు వ్యవసాయకంగా అంత వెనుకపడిలేవు. హైద్రాబాద్ మొత్తంగా పారిశ్రామికంగా వెనుకపడి ఉంది. అందువల్ల హైద్రాబాదు రాష్ట్రంలోని కన్నడుగులు ఐక్యకర్ణాటకరాష్ట్రంలో తమ అవసరాలు అలక్ష్యం చేయబడతాయనే అనుమానం పడనవసరంలేదు."

### కమిషన్ విచారణ

సికింద్రాబాదు, జూలై 2: రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘ సభ్యులు హైద్రాబాదు రాజ్‌ప్రముఖ్ నిజామ్‌ను రాజ్‌భవనంలో ఇవాళ సాయంత్రం కలుసుకొని, లాంఛనప్రాయంగా చర్చలు జరిపారు.

ఫజల్ అలీకమిషన్‌ను ఇవాళ హైద్రాబాద్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ సభ్యుడు శ్రీ బకర్ అలీమిర్జా హైద్రాబాద్ ప్రదేశ కాంగ్రెసు మాజీ ప్రధాన కార్యదర్శి శ్రీ ఫూల్‌చంద్ గాంధి, విశాలాంధ్ర మహాసభ నగర శాఖ ప్రతినిధులు, తెలంగాణ మహిళాసభ ప్రతినిధులు కలుసుకుని తమ అభిప్రాయాలను వెల్లడించారు.

హైద్రాబాద్ పబ్లిక్ వర్క్సు మంత్రి డాక్టరు జి. ఎస్. మేల్కోటే గారుకూడా కమిషన్‌ను ఇవాళ తిరిగి కలుసుకున్నారు.

### మంత్రి శ్రీ మేల్కోటే

మా హైద్రాబాద్ విలేఖరి ఇంకా ఇలా వ్రాస్తున్నాడు: పబ్లిక్ వర్క్సు మంత్రి డాక్టరు మేల్కోటే గారు బెంగుళూరు రాజధానిగా సంయుక్త కర్ణాటకరాష్ట్రం ఏర్పడాలని కర్ణాటక జిల్లాల ప్రజలు వాంఛిస్తున్నారని కమిషన్‌కు నివేదించినట్లు భావించబడుతోంది.

ఒకటి కాక ఎక్కువ కర్ణాటక రాష్ట్రాలు నిర్మించబడే పక్షంలో, హైద్రాబాదు ప్రదేశ కాంగ్రెసు కర్ణాటక ప్రతినిధుల తీర్మానం ప్రకారం అప్పట్లో తమ భవిష్యత్‌ను తాము నిర్ణయించుకొనే హక్కు కలిగి ఉంటామనీ, హైద్రాబాద్‌లోని తమ జిల్లాలు వెనుకబడి ఉండటంవల్ల కొన్ని ప్రత్యేక రక్షణలు కావాలనీ తెలియజేసినట్లుకూడా తెలుస్తోంది.

### శ్రీ ఫూల్‌చంద్‌గాంధి

శ్రీ ఫూల్‌చంద్ గాంధీగారు కలుసుకొని బొంబాయి రాజధానిగా మహావిదర్భతో కలిపి సంయుక్త మహారాష్ట్రనుకోరుతూ సంయుక్తమహారాష్ట్ర పరిషత్తు సమర్పించిన నివేదికను బలపరిచినట్లు చెప్పబడుతోంది.

రెండు తెలుగు, రెండు మహారాష్ట్ర నిర్మాణవాదం ఇటీవల కొందరు లేవనెత్తారనీ, బహుజనాభిప్రాయం యీవాదానికి పూర్తిగా వ్యతిరేకంగానే ఉన్నదనీకూడా వివరించబడిందట.

### ఇతర సంస్థలు

తెలంగాణా వ్యవసాయ కార్మికుల సంఘం తరఫున అభాలు, బాలగురుమూర్తి, టి. నరసింహులు, పి. లక్ష్మణ్ దాస్ గారలు కమిషన్‌ను కలుసుకుని విశాలాంధ్ర కావాలన్నారు.

శ్రీమతి సత్యవతి దేవిగారి అధ్యక్షతన తెలంగాణా మహిళా సమాజం కార్యనిర్వాహకవర్గంవారు హైద్రాబాద్ రాజధానిగా విశాలాంధ్ర ఏర్పడాలని తెలియజేశారట.

హైద్రాబాదునగర విశాలాంధ్ర సంఘంవారు కూడా ఇదే భావాన్ని వ్యక్తపరిచారని చెప్పబడుతోంది.

### రాష్ట్ర బారిస్టర్ల సంఘ అధ్యక్షుడు

రాష్ట్ర బారిస్టర్ల సంఘ అధ్యక్షుడు శంకర్ రావ్ బార్లోంకర్ భాషారాష్ట్ర నిర్మాణాన్ని వ్యతిరేకిస్తూ, ప్రతి 30 లక్షల జనాభాకు ప్రాంతీయ కమీషనర్లను నియమించాలనీ, అన్ని రాష్ట్ర శాసనసభలనూ, మంత్రివర్గాలను రద్దు చెయ్యాలనీ, ప్రతి పదిలక్షలకు ఒక ప్రతినిధి పార్లమెంటులో ఉండేటాలనీ, దీనివల్ల దాదాపు 50 కోట్లు మిగులు ఉంటుందనీ నివేదిక సమర్పించారు.

### ఫజల్ అలీ కమిషన్ నాందేడుకు ప్రయాణం

హైద్రాబాదు, జూలై 3: ఫజల్ అలీ కమిషన్ హైద్రాబాద్ నుంచి బయలుదేరి రేపు నాందేడ్‌కు వెడుతుంది. అక్కడ 5వ తేదీన కూడా ఉంటుంది. ఔరంగాబాద్‌లో 6, 7, 8 తేదీలలో ఉంటారు. హైద్రాబాద్‌కు తిరిగి 9వ తేదీ ఉదయానికి వస్తారు. (స్వ. వి.)

# మూడు రోజులుగా బొంబాయిలో కుంభవృష్టి

## ఒకమేడ అంతస్థు కూలి ముగ్గురి మరణం

బొంబై, జులై 3: మూడు రోజులుగా, బొంబైలోనూ పరిసర ప్రాంతాలలోనూ కుంభవృష్టిగా వర్షాలు కురుస్తున్నవి.

నిన్నటి వానలకే మలాడ్‌లోని ఒక భవనం పై అంతస్తు కూలిపోయి ముగ్గురు మరణించారని తెలుస్తుంది. ఈ ప్రమాదంలో 5 గురు తీవ్రంగా గాయపడ్డారు.

విసురుగా వీస్తున్న గాలి, నిర్విరామంగా కురుస్తున్న వాన, నగరంలో రాకపోకలే కొరవండా, నౌకలూ, విమానాలూ కూడా బయల్దేరడానికి వీల్లేకుండా చేశాయి. రేవులో ఓడలు సరుకు దిగుమతి చేయడానికి వీలులేక పోతోంది.

బల్సార్ ప్రాంతంలోని ఔరంగా, కావేరీ నదులు పొంగి పారుతున్నాయట.

గత 24 గంటలలోనే 8 దుక్కుల వర్షం పడిందట.

కరాచీ ఢిల్లీ రాజకోటకి వెళ్ళే విమానాలు మాత్రం ఒకగంట ముందుగానే బొంబై చేరాయి.

విమానాశ్రయంనిండా వాన నీటకి, చేసిన బాములూ తేళ్లూ మొదలైన వాటిని ఎలాగో చంపి వేశారు.

నగరంలో తక్కువ నీరు ఉన్న రోడ్లు మీదుగా కొన్ని కొన్ని బస్సులు నడుపుతున్నారు.

## జైన విద్యాలయం

మద్రాసు, జులై 3: వ్యవసాయ మంత్రి ఎం. భక్తవత్సలంగారు ఆదివారం 4వ తేదీ ఉదయం 8½ గంటలకు త్యాగరాయనగరం మాడవీధిలో నెం. 8 గృహంలో శ్రీ తారాచంద్ గలాడు జైయిన్ విద్యాలయానికి ప్రారంభోత్సవం చేస్తారు.

# పుదుచ్చేరిలో ఫ్రెంచి ఇండియా గూండాల దౌర్జన్య చర్యలు

## భారత యువజన సంఘ కార్యదర్శికి తీవ్రగాయాలు: గవర్నర్‌కు ఫిర్యాదు

పుదుచ్చేరి, జూలై 2: భారత యువజనసంఘ కార్యదర్శి స్వామీ లూర్దెస్‌ని, ఇవాళ ఉదయం 7-45 గంటలకి సుమారు 20 మంది గూండాలు అటకాయించి ఒళ్లు తూట్లు పడేటట్లు కొట్టారట. వాళ్లు కొట్టిన దెబ్బలకి స్వామీ లూర్దెస్ శరీరంనుంచి రక్తం ధారాపాతంగా స్రవించింది, అతని కోటు రక్తమయమైపోయింది.

ఓ పక్క గాయాలనుంచి రక్తం కారిపోతూండగా, అలాగే బాధపడుతూ స్వామీ లూర్దెస్ గవర్నరుకు ఫిర్యాదుచేయడానికి వెళ్లాడు.

ఆయనవెంట ఫ్రెంచిఇండియా విలీనోద్యమ కాంగ్రెసు కార్యదర్శి ఎస్. పెరుమాళ్, మరికొందరు జాతీయవర్గ నాయకులూ గవర్నరుబసకు వెళ్లారు.

స్వామీ లూర్దెస్ ఫ్రెంచిఇండియా ప్రభుత్వంలో ఒక ఉద్యోగి. ఉదయం 7-45 గంటలకి రిక్షాఎక్కి ఆఫీసుకి బయల్దేరాడట.

రిక్షా నాలుగడుగులు వెళ్లేలోగానే కొందరు హఠాత్తుగా వచ్చి రిక్షాని పడద్రోశారట.

వాళ్లందరూ ఆయుధాలూ ధరించి ఉన్నారనీ, సుమారు 20 మంది ఉంటారనీ, స్వామీ లూర్దెస్ పి. టి. ఐ. విలేఖరికి చెప్పారు.

రిక్షా పడద్రోయగానే క్రిందపడిపోయిన తనమీదకి ఈమూకాఅంతా ఉరికారనీ, చేతికందిన చోటల్లా కొట్టారనీ, తను బాధతో సహాయం కోరుతూ పెద్ద పెద్ద కేకలు వేస్తుండగా, అటు ప్రక్క వచ్చిన కొందరు ఫ్రెంచి ఇండియా పోలీసులువనీ, చూసికూడా తమకు సంబంధం లేనట్టు, పట్టించుకోకుండా వెళ్లిపోయారనీ స్వామీ లూర్దెస్ చెప్పారు.

ఈవిధంగా సాయుధ దుండగులు తన్ను కొట్టడానికి ఇది మూడవసారి అని కూడా ఆయన తెలియచేశాడు.

### గవర్నర్ మనోభావం

చినిగిపోయి రక్తంతో తడిసిన కోటూ రక్తం కారుతున్న గాయాలూ, గవర్నరుకు స్వామి లూర్దెస్ చూపించారు. ఆయనవెంట జాతీయ కాంగ్రెసు నాయకులు కూడా ఉన్నారు.

ఈగాయాలు చూచి, ఫిర్యాదువిన్న తరువాత, పోలీసు ఠాణాకు వెళ్లి ఫిర్యాదు చేయవలసిందని ఫ్రెంచి ఇండియా గవర్నరు చెప్పారట.

గవర్నరుగారు స్వయంగా కలగచేసుకుంటే తప్ప, తాము పోలీసులకి చెప్పడంవల్ల ఏమాత్రం ప్రయోజనం ఉండదని, లూర్దెస్ వెంట వెళ్ళిన పెరుమాళ్ ప్రభృతులు చెప్పారట.

గవర్నరు దానికి ఏ సమాధానమూ చెప్పలేదు.

ఫ్రెంచిఇండియాలో ప్రజల ఉద్యమాన్ని అణచివేయడానికి అధికారులు అవలంబిస్తున్న నిరంకుశ దౌర్జన్య విధానాలకు ఇది మరొక నిదర్శనమనీ, పట్టపగలు, నడిరోడ్డుమీద గూండాలు జాతీయవాదులపైజరిపే దౌర్జన్యాలు కనీసం కూడా గవర్నరు ఏ శిక్ష చర్యలు తీసుకోడానికి ఇష్టపడటంలేదనీ, స్వామీ లూర్దెస్ గవర్నరును చూచివచ్చిన అనంతరం విలేఖరులతో చెప్పారు.

ఇందుకు తగిన విధంగానే, ఏ మూలైనా విలీనోద్యమానికి సంబంధించిన ఊరేగింపులు శాంతియుతంగానైనా జరుగుతున్నట్లు పసికట్టగానే, ఫ్రెంచి ఇండియా పోలీసు మూకఉమ్మడిగా దాడిచేసి అందరినీ అరెస్టు చేసేస్తున్నారనీ స్వామీ లూర్దెస్ అన్నారు.

### అక్రమ ప్రవేశం

భారత ప్రాంతంలోకి ఫ్రెంచి ఇండియా పోలీసులు అక్రమంగా ప్రవేశించి కట్టెల బళ్లవాళ్ళని బెదరించిన సంఘటన ఒకటి తెలియవచ్చింది.

ఇది జూన్ 29-న ఫ్రెంచి లంక కాలాపేటకు ఫర్లాంగు దూరంలో ఆకు మోటుకూలం సరిహద్దువద్ద యిది జరిగింది.

వంటచెరకుతో నిండిన రెండు బళ్లు భారత ప్రాంతంలోకి వెళ్తూండగా ఫ్రెంచియిండియా పోలీసులు హఠాత్తుగా ఆ బళ్ళను చుట్టుముట్టి, బండివాళ్ళని బెదరించారట. వాళ్లు పారిపోయి బళ్లు వదిలేసి దగ్గరలోఉన్న పోలీసు స్టేషనుకి పారిపోయారు. వెంటనే అక్కడనించి మద్రాసు పోలీసులు సాయుధులై ఆ బళ్లదగ్గరకు వెళ్లేసరికి, వంటచెరకుని ఫ్రెంచి ప్రాంతంలోకి పట్టించుకున్న ఫ్రెంచిఇండియా పోలీసులు పారిపోయారట.

## అవమానం భరించలేక ఆత్మహత్య

తిరుచూరు, జూలై 2: బడిలో ఉపాధ్యాయుడు గట్టిగా చీవాట్లుపెట్టి, అవమానించినందుకు భరించలేక, పరుగెత్తుతున్న రైలుకిందపడి పదహారేళ్ళ బాలిక ఆత్మహత్య చేసుకున్నదని ఇక్కడికి 12 మైళ్ళ దూరంలోఉన్న వడక్కంచేరి అనే గ్రామంనుంచి వచ్చిన వార్తలవల్ల తెలుస్తుంది.

యీమె పేరు వెంకటాంబాళ్. క్లాసులో పంతులుగారు అడిగిన కొన్ని ప్రశ్నలకు యీ అమ్మాయి సమాధానం చెప్పలేకపోయింది. అందుకని ఉపాధ్యాయుడు దుర్భాషలాడి అవమానపరచాడట.

వెంటనే, తను ఆత్మహత్య చేసుకోబోతున్నానని ఒక చీటివ్రాసి అక్కడపెట్టి, యీ అమ్మాయి, మెల్లిగా బయటకు జారుకుందట.

తరువాత నలుగురూ వెతుకగా, రైలు పట్టాలదగ్గర తెలివితప్పి పడిఉంది. పరుగెత్తేరైలు లోపడడంవల్ల తీవ్రగాయాలకు గురిఅయి పడివుందట.

వెంటనే ఆమెని ఆస్పత్రికి తీసుకువెళ్ళారు కాని, తీవ్రగాయాలవల్ల ఆమె మరణించింది.

పోలీసులు దర్యాప్తులు జరుపుతున్నారు.

# సర్వీస్ ఈనాములు

## ప్రభుత్వానికి విజ్ఞప్తి

కర్నూలు, జూలై 3: గ్రామాలలోని నౌకరీ (సర్వీస్) ఈనాముల అమ్మకాన్ని నిషేధించవలసిందిగానూ, చాలా గ్రామాలలో ఆ భూములు స్వాధీనంలోవున్నవారు లోగడ విక్రయించిన భూములను తిరిగి స్వాధీనం చేసుకోవలసిందిగానూ ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తూ ఆంధ్రరాష్ట్ర గ్రామ నౌకర్ల సంఘం అధ్యక్షుడు ప్రభుత్వానికొక విజ్ఞప్తి సమర్పించారు.

ఆ విజ్ఞప్తిలో ఇంకా యిలా ఉన్నది:

"గ్రామోద్యోగుల చట్టంలోని అయిదవ సెక్షన్ ప్రకారం సర్వీస్ ఈనాములను విక్రయించరాదు. అట్టివిక్రయాలు చెల్లవు. అయినప్పటికీ అనేకగ్రామాలలో సర్వీస్ ఈనాములను విక్రయిస్తున్నారు. తత్ఫలితంగా ఇప్పుడు నౌకరీ చేయవలసినవారు చాలా ఇబ్బందిపడవలసివస్తున్నది. రైతులకు తగిన నౌకరీ చేయలేకపోతున్నారు.

## మానుకోట కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నిక

మానుకోట, జూలై 1: శ్రీ కటుకూరి వెంకటరెడ్డిగారు మానుకోట తాలూకా కాంగ్రెసు అధ్యక్షులుగా జూన్ 27న జరిగిన ఎన్నికలో ఏకగ్రీవంగా ఎన్నుకోబడారు. యర్రంరెడ్డి ఇంద్రసేనారెడ్డి ఉపాధ్యక్షుడుగా, రావూరి వీరయ్యగారు కార్యనిర్వాహక వర్గానికి ఏకగ్రీవంగా ఎన్నికైనారు. (స్వ. వి.)

# భీమడోలులో పాకిస్తాన్ పౌరుని అరెస్టు

## అనుమతి లేకుండా తిరిగి వచ్చిన నేరం

ఏలూరు, జూలై 1: గత సెప్టెంబరు 19వ తేదీని, అనుమతి పత్రాలు లేకుండా తూర్పు పాకిస్తాన్‌నుండి భారత యూనియన్‌కు వచ్చి వేసిన నేరానికి ఎం. మస్తాన్ అను వత్తిడి(?), ఈ ఉదయం భీమడోలు గ్రామంలో సబ్ యిన్‌స్పెక్టరు ఎం. వెంకటేశ్వరరావు గారు అరెస్టుచేశారు. ఈతడు ఏలూరు వాస్తవ్యుడనీ, 1947 లో తూర్పు పాకిస్తాన్‌కు వలసపోయాడనీ తెలుస్తోంది.

# వాల్తేరులో గవర్నరు వేసవి మకాం పూర్తి

## ఆదివారం గుంటూరుకు ప్రయాణం

విశాఖపట్టణము, జూలై 2: రెండు నెలల వేసవివిడిది గడుపుకుని ఆదివారం త్రివేది దంపతులు గుంటూరు హైకోర్టు స్నాతకోత్సవమునకు బయలుదేరి వెడుతున్నారు. అక్కడనుంచి రాజధానీ నగరము చేరుతారు.

త్రివేదీ దంపతులు ప్రభుత్వ అతిథిభవనములో స్థానిక పత్రికా విలేఖరులకూ, పట్టణములోని ముఖ్యసంఘములూ, ప్రభుత్వకార్యాలయ ప్రతినిధులకూ అల్పాహారవిందు చేశారు.

# వెలుదుర్తిలో హైస్కూలు

## విద్యాశాఖ డైరెక్టరు అనుమతి

కర్నూలు, జూలై 3: కర్నూలు, గుత్తిపట్టణాల మధ్యనున్న వెలుదుర్తిలో ఉన్నత పాఠశాల నెలకొల్పడానికి విద్యాశాఖ డైరెక్టరు అనుమతించినట్లు తెలిసింది. రోజురోజుకూ పెరిగిపోతున్న వెలుదుర్తి పట్టణంలో ఇట్టి పాఠశాలలలో ఇదే మొదటిది అవుతుంది.

ప్రారంభంలో నాలుగు ఫారములు అనగా మొదటి ఫారంనుంచి నాలుగవ ఫారం వరకూ తరగతులుంటవి. సుమారు 250 మంది విద్యార్థులకు ప్రవేశ సౌకర్యాలుంటవి.

ఈ హైస్కూలుకు భవనాన్ని సమకూర్చారు. త్వరలో ప్రారంభించడానికి ఏర్పాట్లు జరుగుతున్నవి.

ఆ ప్రాంతంలోని ప్రజలకృషి ఫలితమే ఈ హైస్కూలు. ఇంతవరకు దాకా చాలాదూరంవెళ్ళి చదువుకోవలసివస్తున్న విద్యార్థులకు చక్కగా వినియోగపడగలదని ఊహిస్తున్నామని బి. శివరామకృష్ణారెడ్డిగారు అన్నారు.

## బస్సుప్రమాదం

### ముగ్గురికి స్వల్పగాయాలు

మదరాసు, జూలై 3: తండియార్‌పేటనుంచి ప్రభుత్వ బస్సుల షెడ్డుకు పోయే ఒక బస్సు కన్నమ్మపేట్‌కు ఎదురుగుండా ఒక ట్రామ్ స్తంభానికి గుద్దుకోవటంతో ఒక డ్రైవర్, ఒక కండక్టర్, ఒక ప్రయాణీకుడు స్వల్పంగా గాయపడ్డారు. బస్సు బాగా నష్టపడిందని చెప్పబడుతోంది.

## లారీప్రమాదం

### ఒకనిమరణం ఇద్దరికి గాయాలు

మదరాసు, జూలై 3: ఐ. వి. ఎస్. లారీ ఒకటి తాంబరం రైల్వేస్టేషను దగ్గర ఒక కల్వర్టును ఢీకొన్నది. ఒకమనిషి మరణించినట్లు ఒక గ్రుడ్డి వృద్ధు ఒకమనిషి గాయపడ్డట్లు చెప్పబడుతోంది. గాయపడ్డవారు జెనరల్ ఆసుపత్రిలో చేర్చబడ్డారని తెలుస్తోంది.

# మడకశిర తాలూకా

## రాష్ట్ర పునర్నిర్మాణసంఘానికి ప్రజాసంస్థల విజ్ఞప్తి

మడకశిర, జూన్ 29: మడకశిర తాలూకా, నిర్వివాద ఆంధ్రప్రాంతమని తాలూకా వ్యాపారసంబంధములన్నియు హిందూపురముతో ముడిపడిఉన్నవని కర్ణాటక ఉద్యమ ప్రచారకులు, ప్రజాభిప్రాయమును ప్రతిబింబించుటలేదని మడకశిర తాలూకాను ఆంధ్రలోనే యుంచవలయునని కోరుతూ, బెంగుళూరిలో సమావేశమైన సందర్భమున, రాష్ట్ర పునర్నిర్మాణ సంఘమువారికి మడకశిర తాలూకా కాంగ్రెసు సంఘమువారు, తాలూకా సేవాసమితివారు, వర్తక సంఘమువారు, తాలూకా పంచాయితీల అధ్యక్షులు, స్థానిక కోఆపరేటివ్ యూనియనువారు టెలిగ్రాములు పంపించారు. (స్వ. వి.)

## రాష్ట్ర వెనుకబడిన జాతుల సభ

విజయవాడ, జూలై 1: ఆంధ్ర రాష్ట్ర వెనుకబడిన జాతుల సంఘాధ్యక్షులు శ్రీ తులాబందుల నాగేశ్వరరావు ఈ క్రిందిప్రకటన చేస్తున్నారు.

"వెనుకబడిన జాతుల రాష్ట్ర ప్రత్యేక మహాసభ ఆగస్టు నెల 5వ తేదీన విజయవాడలో జరుగుతుంది. ఈ సభకు అఖిలభారత వెనుకబడిన జాతుల కమిషను ఆ తేదికి విజయవాడకు వస్తుంది. శ్రీ కాకాసాహెబు కాలేల్కరుగారు మహాసభలో ఉపన్యసిస్తారు. వెనుకబడినజాతుల పారిశ్రామిక వస్తువుల ప్రదర్శనము, సాంస్కృతిక కళాప్రదర్శనములు ఏర్పాటు చేయబడును. అంతేకాదు. అఖిలభారత వెనుకబడినజాతుల కమిషన్ వారికి వివిధ వెనుకబడిన జాతులవారు తమ తమ విజ్ఞప్తులను అందజేయుటకు అవకాశముంది. వివిధ జాతులనుండి వెనుకబడినజాతుల ప్రతినిధు లందరు మహాసభను జయప్రదము చేయుటకు అన్నివిధముల తోడ్పడవలెనని కోరుతున్నాను.

## కడపజిల్లా చేనేత పారిశ్రామిక సంఘ కార్యాలయం

ప్రొద్దుటూరు, జూలై 1: కడపజిల్లా చేనేత పారిశ్రామిక సంఘ కార్యాలయ ప్రారంభోత్సవం మొన్న రాత్రి యిక్కడ అహమ్మద్ నగర్‌లో జరిగింది. సంఘ కార్యదర్శి బుద్ధవరపు మల్లిశెట్టిగారు సభనుప్రారంభిస్తూ, చేనేత పారిశ్రామికులు తమ సమస్యలను తెలుసుకొని తమహక్కుల కోసం పోరాటం సాగించాలని యీ సమస్య పరిష్కారములో, ఈకార్యాలయమును ప్రధానకేంద్రంగా ఉపయోగించుకోవాలని అన్నారు.

కార్యాలయ నిర్వహణ సంఘానికి యీ దిగువవారిని ఎన్నుకొన్నారు:

శ్రీయుతులు కట్టా వరసరామయ్య, కాకి ఆంజనేయులు, మలవతుల సుబ్బన్న, తిప్పావఠి వెంకటరమణయ్య, ఉప్పు సుబ్బన్నగారలు.

## శ్రీ బెజవాడ గోపాలరెడ్డి

మద్రాసు, జులై 3: ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ఇవాళ కారులో నెల్లూరునుంచి మద్రాసు వచ్చారు. కాస్మాపాలిటన్ క్లబ్బులో బసచేస్తున్నారు. ఎల్లుండి సాయంత్రంవరకు ఇక్కడఉంటారు. భారత కాంగ్రెసు కార్యదర్శి శ్రీబలవంతరాయ్ మెహతాగారు ఎల్లుండి ఇక్కడకు విమానంలో ఢిల్లీనుంచి వస్తారు. వారికి శ్రీ రెడ్డిగారు స్వాగతమిచ్చి సాయంత్రం బయలుదేరి ఆంధ్రదేశ పర్యటనకు చిత్తూరు బయలుదేరుతారు.

## రఘుకుల్ రిక్రియేషన్‌క్లబ్

మద్రాసు, జూలై 3: రఘుకుల్ రిక్రియేషన్ క్లబ్ వారు శ్రీ జలగమ్ సుబ్రహ్మణ్య నాయుడుగారి అధ్యక్షతన జూన్ 27వ తేదీన శ్రీ కె. వి. గోవిందరావుగారు రచించిన 'అంతా అబద్ధం' అనే నాటకాన్ని సౌందర్య మహల్‌లో ప్రదర్శించారు. ప్రఖ్యాత సినీమానటుడు సి. హెచ్. నారాయణరావుగారు క్లబ్‌కృషిని ప్రశంసించారు. శ్రీ వై. ఆర్. కె. మూర్తిగారి వందన సమర్పణతో నాటకం పూర్తి అయింది.

# రాష్ట్ర వార్తలు

## రామచంద్రపురం

ఈ గ్రామంలో జూన్ 28వ తేదీ రాత్రి, దుగ్గిరాల ఉప ఎన్నికలో గెలుపొందిన శ్రీ మేడూరి నాగేశ్వరరావుగారికి, వారి వెంటవచ్చిన ముంతెన వెంకట్రాజుగారికి అఖండస్వాగత మిచ్చారు. అంతరితం కాంగ్రెసు శ్రీ జయప్రభలుకట్టి బ్యాండుమేళములతో చుట్టుప్రక్కల గ్రామాలలో ఊరేగించారు. పంచాయతీబోర్డు మాజీ అధ్యక్షులు శ్రీ కుర్రి(?) వెంకటరెడ్డిగారి అధ్యక్షతన బహిరంగసభ జరిగింది. తూర్పు కృష్ణా కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ మండలి వెంకటకృష్ణారావు, కృష్ణా విద్యార్థికాంగ్రెసు ప్రధాన కార్యదర్శి రాధాకృష్ణారెడ్డి ముంతెన వెంకట్రాజు, మేడూరి నాగేశ్వరరావుగారలు సభలో ప్రసంగించారు. తిమ్మారెడ్డిగారి అభివందనాలతో సభ ముగిసింది.

## గౌరిదేవపేట

శ్రీ పుసులూరి కోదండరామయ్యగారు గోదావరి ఏజెన్సీ ఏరువప్రాంత మండలి నూగూరుతాలూకాలో పర్యటిస్తూ జూన్ 26వ తేదీన ఈ గ్రామం వచ్చారు. రేపాక నరసింహారావుగారి అధ్యక్షతన గ్రామస్థులసభ జరిగినది. గ్రామంలోని పోస్టాఫీసును వెంటనే కంబైన్ పోస్టాఫీసుగా యేర్పాటు చేయాలని, బోర్డు హయ్యర్ ఎలిమెంటరీస్కూలును మిడిల్ స్కూలుగా మార్చాలని, ఆస్పత్రి యేర్పాటుచేయాలని, అధికారులను కోరుతూ సభలో తీర్మానించారు. ఈ తీర్మానాలను స్వయంగా పై అధికారుల దృష్టికి తెచ్చి పని సానుకూలమయ్యేట్లు చేయవలసిందిగా శ్రీ పుసులూరి కోదండరామయ్యగారిని కోరారు.

## ఆదోని

జూన్ 27 తేదీ సాయంత్రం మునిసిపల్ మైదానంలో శ్రీ టి. జి. తిమ్మయ్యశెట్టిగారి అధ్యక్షతన జరిగిన సభలో బొంబాయి జీవదయా మండలి కార్యదర్శియు, అఖిలభారత గోవర్ధన కౌన్సిల్ సభ్యులు అగు శ్రీ రావుబహదూర్ జయంతీలాల్ మాన్కార్ గారికి ఆదోని జీవదయామండలి తరఫునను, ఆదోని పౌరులతరఫున రెండు వినతి పత్రములు, సమర్పింపబడినవి.

శ్రీ ఆర్. బి. జే. ఎస్. మాన్కార్ గారు పౌరులు తమకుజూపిన ఆదరాభిమానములకు కృతజ్ఞత తెలుపుతూ దేశాభ్యుదయానికి పశుధనాన్ని వృద్ధిచేసుకోవలసిందిగా ప్రబోధించారు.

ప్రభుత్వము గోవధ నిషేధించునట్లు శాసనము చేయుటకు ప్రజలు ఒత్తిడి చేయవలసిందిగా హెచ్చరించారు.

## ఒంగోలు

ఒంగోలు యువజన సాంస్కృతిక సమితివారు శ్రీ ఉప్పలపాటి గోపాలకృష్ణయ్యగారి అధ్యక్షతన సమావేశమై యీ క్రిందివారిని నూతన సంవత్సరమునకు కార్యనిర్వాహక వర్గముగా ఎన్నుకొన్నారు.

అధ్యక్షులు శ్రీ ఉప్పలపాటి గోపాలకృష్ణయ్య, ఉపాధ్యక్షులు యడవల్లి వెంకటశేషయ్య, కార్యదర్శి చిట్టిగుంట ఆంజనేయులు, కోశాధికారి జి. పదాబాలకృష్ణమూర్తి, సభ్యులు శ్రీయుతులు మంచర్ల రామకృష్ణయ్య, యం. బాలకోటేశ్వరరావు, రావినూతల హనుమంతరావుగారలు.

## గుండ్లపల్లి

జూన్ 17వ తేదీరాత్రి యీ గ్రామంలో శ్రీ గిరిరాజు శేషగిరిరావుగారి అధ్యక్షతన బహిరంగసభ జరిగింది. శ్రీ దిరుసు తులేశవ(?) రామయ్యగారి ప్రార్థన గీతంతో సభ ప్రారంభమైంది. శ్రీ జవందుల వీరరాఘవయ్యగారు గ్రంథాలయమునకు తగు సహాయం చేయవలెనని ప్రజలకు విజ్ఞప్తిచేశారు. గోపిశెట్టి పున్నయ్యగారు రైతుకూలీ కాంగ్రెసు కమిటీలు ఏర్పడాలని అన్నారు. నెహ్రూహాదరంలోచే బుర్రకథ చెప్పబడింది. కొండా పైడులుగారి వందనాలతో సభ ముగిసింది.

## డోర్నకల్ పాఠశాల

### 8వ తరగతికి ప్రారంభం

మానుకోట, జూలై 1: డోర్నకల్ ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలో 8వ తరగతికి తహసీల్దారు కె. నరసింహారావుగారు జూన్ 28వ తేదీన ప్రారంభోత్సవంచేశారు. వరంగల్ కాంగ్రెసు అధ్యక్షుడు నూకల రామచంద్రారెడ్డిగారు, తదితరులు పాల్గొన్నారు.

## గంటల పంచాంగం

శ్రీ జయ సం॥ ఆషాఢ శు॥ చతుర్థి
1954 సం॥ జూలై 4 ఆదివారం
ఆ॥ చతుర్థి 14-8 మఘ రా 2-48వర్జ్యం 14-17 ల 15-57 కు.
సు॥ పంచమి జూలై 5 సోమవారం
సో॥పంచమి14-49పూ॥ఫ రా4-30వర్జ్యం 11-22 ల రా1-5కు



ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర
యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవిసేయకునికి పరాయణము
పరమధర్మపథములకెల్లన్-(మహాభారతము)

శ్రీ జయ సం॥ ఆషాఢ శు॥ చతుర్థి
ఆదివారం

## చైనా ప్రాతినిధ్యం సమస్య

ఐక్యరాజ్య సమితిలో చైనా సభ్యత్వం రద్దుకాలేదు వీటో అధికారంగల అగ్రరాజ్యాలు అయిదింటిలోనూ చైనా ఒకటిగానే వుంటున్నది. ప్రపంచంలో "చైనా దేశాలు" అనేకంగా లేవు చైనా దేశం ఒక్కటే జనరలిస్సిమో చాంగ్ కైషేక్ పాలించిన దేశమే చైనా అని అమెరికా విదేశాంగ శాఖ ప్రవీణులైనా నిరూపించలేరు చాంగ్ కైషేక్ ప్రభుత్వ కార్య స్థానం చైనానుంచి ఫార్మోజాకు మారినంత మాత్రాన ఫార్మోజా చైనాగా మారిపోదు చాంగ్ కైషేక్ చైనాను వదిలివెళ్లి పోయినంత మాత్రాన చైనా, చైనా కాకుండా పోలేదు ఐక్యరాజ్యసమితిలో ప్రాతినిధ్యం దేశాలకు గాని, ప్రభుత్వాలకు గాదు.

ఈ సామాన్య విషయాలను గుర్తించడానికి అమెరికా నిరాకరించడం చిత్రంగా వున్నది చైనాలో ఏర్పడిన కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని అమెరికా పరిగణింపకపోవచ్చును ఎప్పటికైనా చాంగ్ కైషేక్ తిరిగి చైనాను 'జయించి' కుమింటాంగ్ ప్రభుత్వాన్ని స్థాపించగలడని అమెరికా ఆశింపవచ్చును అమెరికా వైఖరిని ఆక్షేపింపగలరేగాని, అమెరికా విధానానికి ఎవ్వరూ అభ్యంతరం చెప్పరు అయితే ఐక్యరాజ్య సమితిలో "పీపుల్స్ చైనా"కు సభ్యత్వం లభింపకుండా చేయడానికి అమెరికా చేసే ప్రయత్నాలను మాత్రం శాంతికాముక రాజ్యాలన్నీ ప్రతిఘటించి తీరగలవు వాస్తవానికి అమెరికా ప్రయత్నాన్ని ప్రతిఘటింపవలసిన అవసరం కూడా కన్పించదు చైనాకు సమితిలో సభ్యత్వం వుండనే వున్నది ఆ సభ్యత్వాన్ని రద్దు చేయగల శక్తిగాని, అధికారంగాని అమెరికాకు లేదు

అసలు సమస్య చైనా తరఫున ఎవరు ప్రాతినిధ్యం వహించాలన్నదే, చైనాకు ప్రాతినిధ్యం వహింపగలవారెవరు అని నిర్ణయించే అధికారం చైనా ప్రజలదిగాని అమెరికా అధ్యక్షునిదిగాదు అమెరికా విదేశాంగశాఖకు ఆ అధికారం లేదు చైనా తరఫున ఫార్మోజా ప్రభుత్వ ప్రతినిధికి సమితి కార్యక్రమాల్లో పాల్గొనే అధికారం వున్నదా అన్న విషయాన్ని అంతర్జాతీయ న్యాయస్థానం పరిశీలించడం సబబు ఈ విధమైన పరిశీలన, విచారణ అవసరం లేకపోయినా అమెరికా చైనాకు సమితిలో సభ్యత్వం వున్నప్పటికీనీ, ప్రాతినిధ్యం లేకుండా చేయడానికి అనుసరిస్తున్న విధానాన్ని భగ్నంచేయడానికి మరొక మార్గం లేదు.

ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశంలో చైనా ప్రాతినిధ్యం సమస్య తిరిగి పరిశీలనకు రానున్నట్లు కన్పిస్తున్నది. అమెరికా సెనెట్ వైదేశిక వ్యవహారాలసంఘు సమావేశానికి సాక్ష్యమిస్తూ విదేశాంగ కార్యదర్శి జాన్ ఫాస్టర్ డల్లెస్ చైనా ప్రాతినిధ్యానికి సంబంధించినంతవరకు అమెరికా వైఖరిలో మార్పేమీ లేదని ప్రకటించారు డెమోక్రాటిక్ పక్షు సభ్యులొకరు "చైనా (కమ్యూనిస్టు)కు సమితిలో స్థానంలభిస్తే అమెరికా సమితినుండి వైదొలగాలి" అని కూడా సూచిస్తున్నారు, ఈ విధమైన మనస్తత్వం ప్రపంచ సమస్యల పరిష్కారానికి ఏ విధంగానూ ప్రయోజనపడదు. అమెరికాలో డెమోక్రాటిక్ ప్రభుత్వంపోయి రిపబ్లికన్ ప్రభుత్వం ఏర్పడగానే, అమెరికా తరఫున రిపబ్లికన్ పక్షంవారు సమితిలో పాల్గొంటే ఇతర దేశాలవారు సమితినుంచి వైదొలగుతామని అంటే ఎంత సబబుగా వుంటుందో, అమెరికా డెమోక్రాటిక్ పక్షు సభ్యుని వాదమూ అంత సబబుగానే వున్నది.

1930-38 మధ్యకాలంలో నానాజాతి సమితి వ్యవహారాలు ఏవిధంగా సాగినవో క్రిందటి అయిదారు సంవత్సరాలుగా ఐక్యరాజ్యసమితివ్యవహారాలు అలాగే సాగుతూ వున్నవి ఈ వ్యవహార గతిని మార్చకపోతే ఫలితం ఏమవుతుందో 1939 విషాద సంఘటనలు విశదం చేస్తున్నవి. ఈ దరిత్ర పునరావృత్తం కాకుండా చేయవలసిన బాధ్యత సమితిలో సభ్యత్వంగల దేశాలన్నింటి మీదా వున్నది.

## ఇండియాలో కాశ్మీర్ చేరిక

### సోవియట్ ప్రజల సమర్థన

జమ్మూ, జూలై 3: ఇండియాలో కాశ్మీర్ చేరికను సోవియట్ ప్రజలు పూర్తిగా సమర్థిస్తున్నారని జమ్మూ రాష్ట్ర నేషనల్ కాన్ఫరెన్స్ కార్యదర్శి కృష్ణదేవ్ సేఠీ నేడిక్కడ వెల్లడించారు. అమెరికన్ సామ్రాజ్యవాదం అడుగుపెట్టిన పాకిస్థాన్‌లో ప్రజాస్వామిక వ్యవస్థ పెంపొందే అవకాశం ఉండదని సోవియట్ ప్రజలు భావిస్తున్నారని ఆయన తెలియజేశారు.

తూర్పు జర్మనీ, సోవియట్ యూనియన్‌లలో పర్యటించి ఆయన ఇటీవలే తిరిగివచ్చారు.

"నేను గిల్గిట్ సరిహద్దుల్లో ఉన్న రష్యన్ ప్రాంతం టాష్కెంట్‌కు వెళ్ళాను. అక్కడి ప్రజలంతా కాశ్మీరు ప్రజల అభిప్రాయాలపట్ల సానుభూతితో ఉన్నారు" అని ఆయన తెలియజేశారు.

## గుంటూరు వైద్య కళాశాల

### కొత్తగా అధ్యాపకుల నియామకం

కర్నూలు, జూలై 2: గుంటూరు వైద్యకళాశాలలో ఈ నెలలో 3వ సంవత్సరం ఎమ్. బి. బి. ఎస్. తరగతి ప్రారంభిస్తున్నారు. గనుక సర్జరీ, బాక్టీరియాలజీ, వైద్య విభాగాలలో ప్రొఫెసర్లనూ, పార్మకాలజీలో ఒక లెక్చరరునూ ప్రభుత్వం నియమించింది

విశాఖపట్టణం వైద్యకళాశాలలో సర్జరీ విభాగంలో అసిస్టెంటు ప్రొఫెసర్ డా॥ ఏమ్. మునిస్వామిగారు గుంటూరు వైద్యకళాశాలలో సర్జరీ ప్రొఫెసర్‌గా పనిచేస్తారు. గిండీ ఇన్‌స్టిట్యూట్ అసిస్టెంట్ డైరెక్టరు ఎస్. డబ్ల్యు. విలియమ్స్ బాక్టీరియాలజీ ప్రొఫెసరుగా పనిచేస్తారు. విశాఖపట్టణం వైద్యకళాశాలలోని థెరాపటిక్స్ ప్రొఫెసరు డా॥ కె. కోదండరామయ్యగారు గుంటూరు వైద్యకళాశాలలో థెరాపటిక్స్ ప్రొఫెసరుగా పనిచేస్తారు. విశాఖపట్టణం వైద్యకళాశాలలో ఫార్మకాలజీ అసిస్టెంటు లెక్చరరు డా॥ ఎ. వి. రామలింగంగారు గుంటూరు వైద్యకళాశాలలో ఫార్మకాలజీ లెక్చరరుగా పని చేస్తారు.

# దేశాభివృద్ధి సాధనలో స్వయంకృషి ప్రాధాన్యం

## — ప్రధాని నెహ్రూ ఉద్బోధ

సిమ్లా, జూలై 2: "సువిశాలమైన మన దేశాన్ని అభివృద్ధి చేసుకోడానికి, మనకున్న సహజ సంపదలు వినియోగించుకోవాలి మన శక్తినేసంఘటితపరచుకుని స్వయం కృషి జరపాలి. ఈ మహత్కార్యంలో సహాయపడడానికి పరులెవ్వరూ ముందుకు రారు" అని ప్రధాని నెహ్రూ ఇక్కడికి సమీపంలో ఉన్న ఖాద్రాలా వద్ద ఒక బహిరంగ సభలో హితవు చెప్పారు.

ఈ కొండ ప్రాంతాలలోని నారుశక్తివంతులనీ, కాయకష్టానికి ఇక్కడి వాతావరణం అనుకూలమైనదనీ చెప్తూ వారందరూ కష్టపడి పనిచేయమనీ, స్వాతంత్ర్యం రక్షించుకోమనీ ఉద్బోధించారు.

ఇక్కడ వర్షాలు బాగా పడుతున్నందువల్ల, సిమ్లానుంచి, ఈ ఖాద్రాలాకు ప్రధానిని తీసుకు వెళ్ళాలా వద్దాఅని, ఇక్కడి అధికారులు తటపటాయించారు. కాని, ప్రధాని నెహ్రూ వెళ్లి తీరవలసిందేనని బయల్దేరారు. దారిలో ఆయన ఎక్కిన కారు బురదలో జారింది. కొద్ది ప్రమాదం తప్పింది. అక్కడ నించి జీపుకారులో ఎక్కి ప్రధాని ఖాద్రాలాకి చేరారు. దారి పొడుగునా వేలాది ప్రజలు హర్షధ్వానాలు చేస్తూ స్వాగతం చెప్పారు.

## "మనం పరభాగ్యోపజీవులం కాము"

జార్ఖండ్, జూలై 2: (హిమాచలప్రదేశ్‌లో పర్యటన నేడు ప్రారంభించినప్రధాని నెహ్రూ, జార్ఖండ్ వద్ద ఒక సభలో ప్రసంగిస్తూ, మన దేశాన్ని సౌభాగ్యవంతంగా చేయడానికి మనం ఎంతో కష్టించవలసి ఉన్నదని చెప్పారు.

"ఇతర దేశాల నుండి వచ్చే ధన సహాయం మీద ఆధారపడి జీవించడానికి, మనం యాచకులం కాము. మనం బాగుపడి, మన దేశాన్ని బాగు చేసుకోవాలంటే మనమే కష్టించి కృషి చేయాలి" అని ప్రధాని ఉద్ఘాటించారు.

జాతి నిర్మాణ కార్యక్రమంలో స్త్రీలు తమ పాత్ర నిర్వహించాలని ఆయన కోరారు.

హిమాచల ప్రదేశ్‌లో ప్రధాని నెహ్రూ వారం రోజులు పర్యటన చేస్తారు.

నేటి ఉదయం 8 గంటలకు సిమ్లా నుంచి బయల్దేరి కొన్ని ప్రాంతాలు సందర్శించారు. అంతటా వేలాది ప్రజలు ప్రధానికి అఖండ స్వాగతమిచ్చారు.

## ఆంధ్రలో అమలులోకి వచ్చిన కేంద్ర శాసనాలు

కర్నూలు, జూలై 3: 1953 అక్టోబరునుంచి యీ క్రింది విషయాలలో కేంద్రప్రభుత్వం అమలు జరిపిన చట్టాలు ఆంధ్రలోకూడా అమలులోకివచ్చినవని భారతప్రభుత్వం ఉత్తరువులు ఇచ్చింది: ఆ చట్టాలు ఇవి: 1885 లో అమలు జరపబడిన గనుల భూమిస్వాధీనం చట్టం, 1899 లో భారతప్రభుత్వం అమలు జరిపిన భారతస్టాంపుల చట్టం; 1908వ సంవత్సరం భారతీయ రేవులచట్టం, 1934 లో అమలుజరపబడిన ఇండియా రిజర్వుబ్యాంకుచట్టం; 1944 లో అమలుజరపబడిన కొబ్బరికాయలసంఘం చట్టం, 1946 లో అమలు జరపబడిన మార్జెంజల చట్టం, 1947 నర్సింగ్ కౌన్సిల్ చట్టం, 1948 లో అమలుజరపబడిన కేంద్రసిల్కు బోర్డు చట్టం, 1885 లో అమలుజరపబడిన మద్రాసు ఇతర సాక్ష్యాశయాల చట్టం, 1885 లో అమలు జరపబడిన మద్రాసు రైల్వే రక్షణ చట్టం.

## తాటిబెల్లం వస్తువుల ఉత్పత్తి అభివృద్ధి స్కీము

కర్నూలు, జూలై 3: తాటిబెల్లంతో తయారయ్యేవస్తువుల ఉత్పత్తిని అభివృద్ధిచేయడానికి తలపెట్టినస్కీమును ప్రభుత్వం ఆమోదించింది. యీ స్కీమును అమలుజరపడానికి లక్షరూపాయల వ్యయమవుతుంది. యీ స్కీము ఎలా అమలుజరుపుతుంటేది పరిశీలించడానికి, ఉపముఖ్యమంత్రి అధ్యక్షులుగా, ప్రభుత్వం ఒక కమిటీని గూడ నియమించింది.

కమిటీలో మిగతా సభ్యులు: శ్రీ ఎన్. బి. పి. పట్టాభిరామారావు శ్రీ ఎన్. వెంకటయ్య, శ్రీ వై. వి. కృష్ణారావు శ్రీ కె. అప్పారావు (రాజమండ్రి) శ్రీ భుజంగరావు (కోదూరు పండ్ల ఉత్పత్తి నిపుణుడు) గారలు డెవలప్‌మెంటు కమీషనర్ డా॥ బి. నటరాజన్ గారు కమిటీ కార్యదర్శిగా వ్యవహరిస్తారు యీ స్కీముకు అయ్యే లక్షరూ. ల ఖర్చులో సగం భారత ప్రభుత్వం సబ్సిడీగా యివ్వవచ్చు. భారత తాటిబెల్లం పరిశ్రమ సలహాదారు శ్రీ గజానన నాయక్ యిటీవల ఆంధ్రరాష్ట్రానికివచ్చి, ఆంధ్రలో తాటిబెల్లం పరిశ్రమ యేర్పాటుచేయుటకు గల అవకాశాలను గురించి ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశంగారితోను పరిశ్రమ మంత్రి శ్రీ పట్టాభిరామారావుగారితోను చర్చించి వెళ్ళారు.

## పగ్లాడియా హిగ్రా నదులకు వరదలు

గౌహతి, జూలై 2: పగ్లాడియా హిగ్రా నదులు తిరిగి విజృంభించాయనీ, ఇప్పటికే వందలకొద్ది ఎకరాలలో పంటలకు ముంచిపెట్టినవనీ వార్తలు వస్తున్నవి.

ఈ వరదల మూలంగా 50 వేలమంది నానా ఇబ్బందులూ పడుతున్నారట. రైలుదారి నాలుగడుగుల నీటిలో మునిగి ఉంది. నిన్న మధ్యాహ్నంనుంచి కొన్ని ప్రాంతాలలో రైళ్లు నిలిపివేసినట్లు అధికార ప్రకటన వెలువడింది.

## దేశంలో సమాజాభ్యుదయ ఉద్యమం

### టొరాంటో సభలో భారత ప్రతినిధి వివరణ

టొరాంటో, జూలై 2: భారత దేశంలో ఒకవ్యక్తి పుట్టుకగాని, జాతిమతకులాలుగాని, అతడి వ్యక్తిగత గౌరవ ప్రతిష్ఠలను ఆచ్ఛాదించకోవని, బీహారు రాష్ట్ర ఆర్థిక, వ్యవసాయ, కార్మిక శాఖల మంత్రి డా॥ ఎ. ఎన్. సిన్హా ఇవాళ అంతర్జాతీయ సంఘ సేవకుల సమావేశంలో అభిభాషించారు.

భారతదేశంలో అనుదినం విస్తృతమౌతున్న సమాజాభ్యుదయఉద్యమానికి మూల విరాట్లు సాంధ మహాత్మా గాంధీయేనని ఆయన అన్నారు.

అస్పృశ్యత, కులభేదాలు నివారించడం, సర్వ సమానత్వం స్థాపించడం, పేదల శ్రేయస్సుకు కృషి చేయడం, గాంధీజీ అనుయాయుల పరమ లక్ష్యాలని ఆయన చెప్పారు.

నిర్బంధించే అధికారాలుగల ప్రభుత్వ వ్యవస్థలస్థానే, చివరకి సహకార విధి నెలకొనగలదని ఆశిస్తున్నామనీ, మార్క్సువలెనే, గాంధీజీ అనుయాయులనుకూడా వ్యక్తులపై ప్రభుత్వ అధికారాలు క్రమ క్రమంగా తగ్గిపోవడంలో విశ్వాసం ఉన్నదనీ శ్రీ సిన్హా చెప్పారు.

అయితే కమ్యూనిస్టులు నిర్బంధ సంస్థలు నెలకొల్పి, తద్వారా ప్రభుత్వ అధికారాలను బలపరచి, ఇనుము డింప చేస్తున్నారనీ, సర్వోదయసిద్ధాంతాలు అనుసరించేవారు, సహకార విధానంద్వారా ప్రజలకార్యకలాపాలు ఎంతవరకు నిర్వహించడానికి సాధ్యమౌతుందో, అంతవరకూ ప్రభుత్వ అధికారాలనూ, అజమాయిషీనీ తగ్గించడానికి కృషి చేస్తారనీ ఆయన వివరించారు.

## సోవియట్ నౌక

మాస్కో, జూలై 3: అమెరికా పట్టుకున్న సోవియట్ నౌక "టువాప్సే"ని సిబ్బందితోనూ, సామగ్రితోనూ వెంటనే విడుదలచేయవలసిందని కోరుతూ సోవియట్ ప్రభుత్వం అమెరికాకు మరొక లేఖను పంపింది.

అమెరికా నౌకాదళ అజమాయిషీ కింద ఉన్న ప్రాంతంలో తైవాన్ ద్వీపంవద్ద ఈ నౌక అక్రమంగా పట్టుకోబడిందని ఆలేఖలో పేర్కొనబడింది.

తమ నౌకాదళానికి ఈ సంఘటనలో జోక్యం లేదని అమెరికా లోగడ చెప్పిన సమాధానం సంతృప్తికరంగా లేదని రష్యా పేర్కొన్నది.

ఈ విషయంలో నష్టపరిహారం అడిగే హక్కుకూడా తనకు ఉందని రష్యా స్పష్టపరచింది.

# బంజర్ల పంపిణీకి సిబ్బంది నియామకం

## మంత్రివర్గ సమావేశ నిర్ణయాలు

కర్నూలు, జూలై 3: తన అధీనంలో వున్న బంజరు భూములను భూములులేని పేదవారికీ, రాజకీయ బాధితులకూ ఇచ్చే విషయంలో ఆంధ్రప్రభుత్వం మరికొన్ని నిర్ణయాలు చేసింది.

ఈ వేళ ఉదయం ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశం పంతులుగారి నివాసంలో జరిగిన సమావేశంలో, బంజరు భూముల పంపిణీ కార్యక్రమంగురించి లోగడ పరిశీలించబడని అనేక వివరాలను మంత్రివర్గం నేడు పరిశీలించింది.

బంజరుభూముల పంపిణీ సమస్య వివరాలను పరిశీలించి, వాటి పంపిణీకి సంబంధించిన ప్రతిపాదనలను రూపొందించి, ఆయా ప్రతిపాదనలను అమలు జరపడానికి అవసరమయిన సిబ్బందిని నియమించడానికిగాను ఉపముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారు ఇటీవల కొంతమంది జిల్లాకలెక్టర్ల సమావేశాన్ని యేర్పాటు చేసిన విషయం పాఠకులకు తెలిసినదే.

ఈ నిర్ణయాలను అమలు జరపడానికి అవసరమయిన సిబ్బందినికూడా ప్రభుత్వం నియమించింది. తహశీల్దార్లూ డిప్యూటీ తహశీల్దార్లూ నిర్ణయించే సూత్రాలప్రకారం మెట్టబంజరుభూములను పంపిణీ చేస్తారు.

కలెక్టర్లకు అప్పీలు చేసుకొనడానికి వీలు కలిగించే షరతులతో బడి మాగాణి బంజరుభూములను రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్లు పంపిణీ చేస్తారు.

రాజకీయ బాధితులకు భూములను ఇచ్చే కార్యక్రమం 1952 ఏప్రిల్ 14 వ తేదీన ఆపివేయబడింది. కనుక ఆ నాటికి భూములు కావాలని దరఖాస్తులు పెట్టుకొన్న రాజకీయ బాధితులు కోరిన భూములలో వారు దరఖాస్తులు పెట్టుకొనేనాటికి ఆయా భూములు భూములులేని పేదవారి అధీనంలోగాని శివాయ్ జమీందార్ల అధీనంలోగాని లేకపోయినట్లయితే, ఇప్పుడు అవి భూములులేని పేదవారి అధీనంలోగాని, లేక శివాయ్ జమీందారుల ఆధీనంలోగాని వున్నా, వారిచేత భూములను ఖాళీ చేయించవలసి వచ్చినా, అట్టి దరఖాస్తులనుకూడా పరిశీలించాలని ఇప్పుడు నిర్ణయించారు.

తాత్కాలికంగా భూములను కేటాయించిన నాటికి, అవి శివాయ్ జమీందారుల అధీనంలో లేకపోయినట్లయితే అవసరమయితే ఇప్పుడు వాటికి యజమానులుగావున్న భూములులేని శివాయ్ జమీందారులచేత వాటిని ఖాళీ చేయించి ఆయా కేటాయింపు లన్నింటినీ ఖాయపరచాలి.

ఈ వేళ ఉదయం ఎనిమిదిన్నర నుంచి మధ్యాహ్నం ఒంటిగంటవరకూ జరిగిన ఈ మంత్రివర్గ సమావేశానికి ముఖ్యమంత్రి ప్రకాశం పంతులుగారు అధ్యక్షత వహించారు. ఆర్థిక న్యాయశాఖల మంత్రి తెన్నేటి విశ్వనాథంగారుతప్ప మిగతా మంత్రులందరూ సమావేశానికి హాజరైనారు. కేంద్ర హోంశాఖ మంత్రి డాక్టరు కైలాస్‌నాథ కట్జూ గారికి స్వాగతం ఇవ్వడానికిగాను ఆర్థిక న్యాయశాఖల మంత్రి విశ్వనాథంగారు నిన్న సాయంత్రం ఇక్కడనుంచి బయలుదేరి వాల్తేరు వెళ్లారు.

# విరివిగా విరాళాలు ఇవ్వాలని సంస్థానాధీశులకు నెహ్రూ లేఖ

['ఆంధ్రపత్రిక' విలేఖరి]

న్యూఢిల్లీ, జులై 3: జాతీయ అభివృద్ధి ఋణానికి ఉదారంగా విరాళాలు ఇప్పించవలసిందిగా సంస్థానాధీశులను కోరుతూ ప్రధానమంత్రి నెహ్రూ వారికి ఇంకో ఉత్తరాన్ని వ్రాసినట్లు తెలుస్తున్నది.

అంతేగాక, నిజాంనవాబు తమ చరాస్తుల నన్నింటినిగూర్చి ట్రస్టును ఏర్పాటు చేసినట్లు తక్కిన సంస్థానాధీశులుగూడా ఏర్పాటుచేస్తేదాగుంటుందనిగూడా ఆయన ఇందులో సూచించినట్లు చెప్పుకుంటున్నారు.

ఈ ఉత్తరంలో ప్రధానమంత్రి ప్రివీపర్సులనుగూర్చిగూడా ప్రస్తావించారట. అదివరకు నెహ్రూ వీరి ఈ మొత్తాలను తగ్గించుకోవలసిందిగా కోరుతూ ఒక ఉత్తరం వ్రాశారు. ఇప్పుడు ఈ ఉత్తరంలో ఆ ఉత్తరం సంగతి ఎత్తి, అందులో పేర్కొన్న విధంగా నడుచుకోవలసిందని ఇంకో విజ్ఞప్తి చేసినట్లు తెలుస్తున్నది.

## కొరియా భవిష్యత్తు

వాషింగ్టన్, జూలై 2: కొరియా భవిష్యత్తునుగురించీ,ఇతర సమస్యలను గురించీ సంప్రదించుటకు రావలసిందని ప్రెసిడెంట్ ఐసెన్‌హోవర్ దక్షిణ కొరియా అధ్యక్షుడు సింగ్మన్‌రీని ఆహ్వానించినట్లు ఇక్కడ పత్రికలు నేడు వెల్లడించినవి.

నేడు సియోల్‌లో దక్షిణకొరియా పార్లమెంటు విదేశాంగమంత్రి ప్యాన్ యంగ్ టాయ్ ఏర్పాటుచేసిన ప్రభుత్వాన్ని ఆమోదించ నిరాకరించింది. ప్యాన్ యంగ్ టాయ్ సింగ్మన్‌రీ ఆదేశం ప్రకారం యీ ప్రభుత్వాన్ని ఏర్పాటుచేశారు.

# పొగాకు ఉత్పత్తి: ఆంధ్ర ప్రభుత్వ కర్తవ్యం

### శ్రీ పువ్వాడ మృత్యుంజయరావు

ఇండియా పొగాకు పండించే ముఖ్యమైన దేశాలలో ఒకటిగా ఉన్నది. ఏటా షుమారు 785,000 ఎకరాల పొలంలో పొగాకు పండింపబడుచున్నది. పొగాకుపంట విషయంలో ప్రపంచంలో అమెరికా, చైనా దేశాల తరువాత ఇండియా తృతీయ స్థానమును ఆక్రమించుచున్నది. పొగాకు ఎగుమతుల వల్ల ఏటేటా దాదాపు 186 మిలియన్ల రూపాయలకు సమానమైన విదేశీద్రవ్యమును మనదేశ మునంపాదించగలుగుచున్నది. ఇదిగాక కేంద్ర ప్రభుత్వము ఎక్సైజు సుంకముద్వారా సంవత్సరానికి రమారమి 848 మిలియన్ల (10 మిలియన్లు: ఒక కోటి) రూపాయల దాకా ఆదాయాన్ని పొందుచున్నది.

ఆంధ్రదేశములో పొగాకు పంటకు ప్రత్యేక స్థానమున్నది. ఈ రాష్ట్రంలో షుమారు 3000,000 ఎకరాల విస్తీర్ణంలో ఏటా పొగాకు పండించబడుచున్నది. ఇక్కడ పండే పొగాకులో నాటు, వర్జీనియా అను రెండు రకములుకలవు. నాటు పొగాకు చుట్టలు, బీడీలు, నశ్యము, తమ్మాకు Chewing Tobacco) మొదలైన వాటికి వుపయోగించబడుచున్నది. కాగా వర్జీనియా పొగాకు అచ్చగా సిగరెట్లు తయారుచేయుటకు ఉపయోగించబడుచున్నది. నాటు పొగాకు రాష్ట్రమంతటా పండుతుంది. వర్జీనియా పొగాకు గుంటూరు, కృష్ణా, పశ్చిమ గోదావరి నెల్లూరుజిల్లాలలో మాత్రమే పండుతుంది. ఈ అయిదు జిల్లాలలో కలిపి 175,000 ఎకరాల పొలంలో వర్జీనియా పండుతుందని అంచనా వేయబడింది. ఈ జిల్లాలలో ఇదిగాక షుమారు 100,000 ఎకరాలలో నాటు పొగాకు కూడా పండుతుంది. దీనిని బట్టి చూడగా ఆంధ్రదేశంలో పండే పొగాకులో అత్యధికభాగం ఈ అయిదుజిల్లాలలోనే పండుచున్నదని బోధపడగలదు. విశాఖపట్టణం జిల్లాలో వర్జీనియా పొగాకు కూడా పండించుటకు అవకాశముకలదని తెలియుచున్నది.

సిగరెట్టు పొగా (వర్జీనియా)కు ఆంధ్రదేశపు గుత్తపంట అనుట నిర్వివాదాంశము. ఇండియాలో పండే వర్జీనియా పొగాకులో దాదాపు నూరింట 95 వంతులు ఒక్క ఆంధ్రదేశములోనే పండుచున్నది. ఈ పంట ఈ ప్రాంతంలో స్థిరపడిపోయింది. వ్యాపారం విషయంలో అనేక దేశాలతో బలమైన వాణిజ్య సంబంధాలను కూడా నెలకొల్పుకొని గలిగింది ఆంధ్రదేశం. విదేశాల నుండి ఇండియా సంపాదించుచున్న 186 మిలియన్ల రూపాయల విదేశ ద్రవ్యంలో అత్యధిక భాగం ఆంధ్రదేశంలో మాత్రమే పండుచున్న ఈ వర్జీనియా పొగాకు వల్లనే లభ్యమగుచున్నదని చెప్పవచ్చు.

రైతులకు ముఖ్యంగాపైన చెప్పిన అయిదుజిల్లాలలోని రైతులకు ఈ పంట అతిముఖ్యమైనది. కొన్ని సందర్భాలలో ఇదే రైతుకు ప్రధాన వాణిజ్య పంట. ఇదే అతనికి ప్రధాన జీవనాధారంగా కూడా ఉన్నది. కొన్ని ప్రాంతాలలోని కొన్ని గ్రామాలలో పొగాకు ఒక్కటే ఏకమ్మకంగా పండేపంటగా యున్నది. ఈ పంటయొక్క ఒడుదుడుకుల వల్లనే గ్రామాలకు గ్రామాలు ఆర్థికంగా అభివృద్ధి పొందడమో, అణగారి పోవడమో జరిగిన సందర్భాలు లేకపోలేదు. ఇటీవల ఈ పంట విషయంలో వచ్చిన అనేక చిక్కు పరిస్థితులవల్ల ఎంతో మంది వ్యవసాయదారులు ఎన్నో నష్టాలకు గురి అయ్యారు. రైతులు ఈ పంటను సరైన పద్ధతులతో పండించవలసిన అవసరాన్ని గుర్తించలేక పోయినందువలన ముఖ్యంగా పొగాకు రైతులు ఇబ్బందిపడ్డారు. దురదృష్టవశాత్తు అతని పాత విధానాలతోనే అతను సతమతము గావలసిన స్థితిలో రైతువదలి వేయబడడంవల్ల రైతువిఫలుడయి పోతున్నాడు. పొగాకు పంట విషయంలో ఏమిచేయగునో, ఏమిచేయదగదో అనే విషయాన్ని రైతులకు సలహా ఇవ్వగల సంస్థ ఒక్కటే ఉండినట్లయితే ఈ నాడు పొగాకు రంగంలో ఏర్పడిన సంక్షోభం ఏర్పడి ఉండేది కాదు.

రాష్ట్ర ప్రభుత్వం ఈ పరిస్థితులను గమనించి ఈ ప్రమాదాలను నివారించుటకు తగినచర్యలు తీసుకొనవలసిన సమయము ఆసన్నమయినది. ఈ పరిస్థితిని ఎదుర్కొని రైతులస్థితిని మెరుగుపరచవలసిన బాధ్యత రాష్ట్రప్రభుత్వముపై ప్రధానముగా కలదు.

ఈలాంటి పరిస్థితులలో ఎవరయినా రాష్ట్రప్రభుత్వ జోక్యమును కోరుట సహజము. అయితే రాష్ట్రప్రభుత్వము తనదృష్టినంతటినీ ఆహారపంటల విషయంపై కేంద్రీకరించి ఉన్నందువల్ల నేమి, రాష్ట్రప్రభుత్వము ఇండియన్ సెంట్రల్ టుబాకో కమిటీ విధానాలతో గల వైరుధ్యంవల్లనైతేనేమి యీనాటివరకు రాష్ట్రప్రభుత్వము ఏమీ చేయలేదనే చెప్పకతప్పదు.

ఈపైన వూహించబడుతున్న అవరోధాలే నిజమైనవైనట్లయిన రాష్ట్రప్రభుత్వము తగినవిధానమును అన్వేషించవలసి యున్నది. దేశంలో ఆహారపరిస్థితి బాగుపడింది. ఆహారం విషయంలో దేశం స్వయంసమృద్ధమైనదిగా ఇప్పుడు చెప్పబడుచున్నది. నేటి నాడు ఇండియాకు రావలసింది ఒక్క ఆహారము మాత్రమే కాదు. దేశాన్ని భాగ్యవంతం చేయగల ఎగుమతి వ్యాపారాన్ని పెంచి అభివృద్ధి చేయగల సరుకులు, వస్తువులు కావాలి అటువంటివాటిలో పొగాకుఅతిముఖ్యమయినది. ఇండియన్ సెంట్రల్ టుబాకో కమిటీ దేశంలో వివిధ ప్రాంతాలలో పరిశోధనా కేంద్రాలను నెలకొల్పిపనిచేయుచున్నది. పొగాకుపరిశ్రమకు సంబంధించిన వివిధ అంశాలను పెంపొందవలసిన బాధ్యతకూడా యీ సెంట్రల్ టుబాకో కమిటీకివున్నది.

ఈ సంస్థ దేశమంతటికీ సంబంధించినది. ఇది రాష్ట్రాలకు సలహాలిచ్చేదిగా ఉంది. ఆయా రాష్ట్రాలలో తలపెట్టబడే వివిధ కార్యక్రమాలకు విరివిగా ఆర్థికసహాయం చేయవలసి వున్నదని ఎవరయినా భావించడం సహజమే. రాష్ట్రప్రభుత్వము ప్రజలకు సన్నిహితంగా ఉంటుంది. వారిఅభిమతాలు అభిరుచులు తెలుసుకొని వారిఅభివృద్ధికి తగిన ప్రణాళికలను నిర్మించి, తనకుగల అంగబలంతోనూ, ప్రజలపైగల అజమాయిషీతోనూ, అమలుజరుపగలుగుటలో మరేసంస్థగాని దానితో సరిరాగల దనగలమా?

పొగాకుపరిశ్రమకు సంబంధించిన ప్రతిసమస్యను ఇండియన్ సెంట్రల్ టుబాకో కమిటీద్వారానే పరిష్కరింపబడాలనే ఆలోచనఉన్నంతవరకు ఆ కమిటీవల ఏ సమస్య పరిష్కారం కాజాలదు. ఇది వాంఛనీయమూ గాదు ప్రయోజనమైనదీగాదు. కేంద్రప్రభుత్వం ఇచ్చే గ్రాంటులను (నిధులను) వాడవలసిన ఈ కమిటీ రాష్ట్రప్రభుత్వాలు తలపెట్టే అభివృద్ధి విస్తరణ ప్రణాళికలకు అవసరమైన ఆర్థికసహాయమును విరివిగా అందించబడవలసి యున్నది. పరిశోధనా కార్యక్రమాన్ని గూడా రాష్ట్రప్రభుత్వమే తనకుగల నిపుణులతోనూ, పరిశోధనాశాలల ద్వారాను నిర్వహించదగియున్నది. కాగా ఈ సెంట్రల్ కమిటీస్థానింగువంటి విషయాలలో రాష్ట్రాలకు సలహా యివ్వడం న్యాయంగా ఉంటుంది.

ఇక మంచిపద్ధతులద్వారా పొగాకు పండించుటవంటి ముఖ్యవిషయాలలో పొగాకు ఉత్పత్తిదారులలో విజ్ఞానం కల్గించుటకు రైతులమధ్య విరివిగా ప్రచారము సాగించవలసిఉండగా ఈ విషయములో ఆ కమిటీ చెప్పదగినంతగా ఏమీచేయనేలేదు. కనుక ప్రభుత్వ వ్యవసాయశాఖలో పొగాకు అభివృద్ధిశాఖను ఏర్పరుచుట అత్యవసరమైన విషయము. ఒక టుబాకో డెవలప్‌మెంటు ఆఫీసరును నియమించి అభివృద్ధి ప్రచారాది కార్యక్రమములు అతని అధ్వర్యమున జరిపించుట అవసరము. పొగాకుపనికి సంబంధించినంతవరకు ఈ ఆఫీసరుకు అవసరమైన సహాయం సిబ్బంది (అసిస్టెంట్లు, ఫీల్డుమెన్, మేస్త్రీలు)ని నియమించవలసియున్నది. ఈ శాఖవారు పొగాకు వుత్పత్తిదారులతో సంవత్సరంపొడుగునా సన్నిహిత సంబంధాలు పెట్టుకొని నిత్య వ్యవహారాలలో అతనికి దైనందికంగా సలహాలిచ్చుచుండవలసివున్నది. ఈ డెవలప్‌మెంటు ఆఫీసరుగా నియమించబడేవ్యక్తి పొగాకుకు సంబంధించిన అన్ని విషయాలలోను మంచి అనుభవముకలిగివుండి, విస్తరణ కార్యక్రమానికి, పరిశోధనాకృషికి మధ్య లైజాన్ (అనుసంధానకర్త)గా వ్యవహరించగలిగిన శక్తికలిగివున్నవారుగా ఉండడం అవసరం.

వ్యవసాయదారు తన పొగాకును పండించడంలో అనుసరించే విర్లక్ష్య పద్ధతినిబట్టి పొగాకు పరిశ్రమయొక్క ప్రస్తుత పరిస్థితిని గురించి చెప్పవచ్చు. పొగాకు ఉత్పత్తి మార్పు రింగుకు సంబంధించిన నవీన పద్ధతులను ప్రచారము గావించి అమలులో పెట్టించవలసి వున్నది. ఇందుకుగాను కొన్ని సూచనలు ఈ క్రింద చేయబడినవి.

### విత్తనములు

శ్రేష్ఠమైన మేలు రకపు విత్తనములు పంటకు ప్రాణప్రదము లైనవి. నాసిరకము విత్తనములను ఉపయోగించుటవల ఈ పరిశ్రమకు పెద్దిగా హాని జరుగుచున్నదని అందరూ చెబుతున్నారు. కనుక రైతులకు మంచిరకము విత్తనములు లభ్యమగునట్లు చేయవలసివున్నది. వర్జీనియా తోటలకై పెంచు నారు మళ్లకు సంవత్సరానికి 8 నుండి 10 వేల పౌనుల వరకు విత్తనములు అవసరము కాగలవు. అవసరమైతే ప్రభుత్వ ఫారములలోనైనా ఈ మొత్తము మేలు రకపు విత్తనములు పండించవలసి యున్నది. ఈ కార్యక్రమ నిర్వహణలో ఇండియన్ సెంట్రల్ టుబాకో కమిటీ, ఐ. యల్. టి. డి. కంపెనీవంటి సంస్థలతో సమాలోచించి వారి సహకారమును పొందుట మంచిది.

### నారుమళ్లు

ఏటా దాదాపు 2000 ఎకరాల విస్తీర్ణంగల నేలలో నారుమళ్లు పెంచబడుతున్నవి. ఇవి ముఖ్యముగా బాపట్ల, చీరాల మొదలయిన ఇసుక (డెల్టా) ప్రాంతాలలోనే పెంచబడుచున్నవి. ఇప్పుడు జరుగుతున్న [illegible] ప్రతి తోటచోట వారు తోచిన విధంగా ఈ నారు మళ్ళను పెంచడం జరుగుతున్నది. నారుమళ్ళ విషయంలో సాధించబడే అభివృద్ధివల్ల పొగాకు రైతుకు ఎంతో లాభం కలుగుతుంది పంటలో ఎంతో అభివృద్ధి వుంటుంది. పొగతోటలు వేసే ప్రాంతాలలో నే నారుమళ్లను బాగా పెంచు పద్ధతులు కనుగొనబడి యున్నవి. ఈ పద్ధతులను ప్రోత్సాహ పరచిన యెడల రైతు తక్కువ ఖరీదుతో వాడిపోకుండా ఉండే నారును త్వరగా పొందగలడు.

### కాలువమార్పు పద్ధతి

వీలయినంత ఎక్కువ వరుమానం సంపాదించాలనే ఆతురతవల్ల రైతు కాలుమార్పిడి పద్ధతిని అవలంబించకనే ఏటా ఒకే పంటను వేయుట జరుగుతున్నది. కొన్ని పంటలమార్పు పొగాకు పంటకు గిట్టదని తేలుతున్నది కనుక దీని సరిచిద్దవలసి వున్నది.

### ఎరువులు

బలవర్ధకమైన ఎరువులను సక్రమ మార్గంలో ఉపయోగించుటవలన రైతుకు ఎంతో లాభం వుంటుంది. ప్రస్తుతం ఉపయోగింపబడుతున్న కొన్ని రసాయనికపు ఎరువులు పొగాకు పంటకు జాస్తిగా పనికిరావని తేలుస్తున్నది. ఎరువుల వేయుటలో మార్పు వచ్చినట్లయిన పంట పెరుగగలదు.

### కోతలు, క్యూరింగు వగైరా

ఆకు విరుపు సమయంలో క్యూరింగులోనూ ఉపయోగించే కొన్ని పద్ధతుల వల్ల మంచి రకముకంటే నాసిరకపు పొగాకే ఎక్కువగా దిగుమతి అవుతున్న విషయం అందరూ ఎరిగినదే. ప్రచారము ద్వారా వీటిని కుదుపుగానే సరిదిద్దవచ్చును.

పైవాటికి, తోడుగా మట్టి నిర్మూలనము, నేల, పంటల కానిసేవకా పద్ధతి, తెగుళ్ళ నరికట్టుటవంటి పద్ధతుల ద్వారా పొగాకు పంటను అభివృద్ధిపరచవచ్చును. పొగాకు విత్తనాలు మొదలు క్యూరింగువరకు ప్రతివిషయంలో సరిన పద్ధతులను అవలంభించుటకు అవకాశమున్నది. అయితే రావలసిందల్లా ఈ అన్ని విషయాలను ఎప్పటికప్పుడు తుంగంగా రైతులకు బోధపడునట్లు చేయగల సమర్థమైన యంత్రాంగము తగిన సిబ్బందితో ఏర్పరచబడే విస్తరణశాఖ ఈ పనిని నిర్వర్తించగలదు.

చెరుకుతో పోల్చి చూచినట్లయితే ఆంధ్రదేశంలో పొగాకుపంట విస్తీర్ణం చెరుకుపంటకు దానికి రెట్టింపు ఉన్నది. ఒక్క వర్జీనియా పొగాకుపంట విస్తీర్ణమే చెరుకు పంట విస్తీర్ణానికి సమానంగా వున్నది. ఈ వర్జీనియా పంట అయిదు జిల్లాలలో మాత్రమే కేంద్రీకృతమై యున్నది. కనుక ఈ విస్తరణ కార్యక్రమం అమలు జరుపుట సులభసాధ్యమే కాగలదు. ఈ పంటకై కొన్ని లక్షల రూపాయలను రాష్ట్రప్రభుత్వం వెచ్చించటం వృధా కాబోదు. పైగా ఆంధ్రదేశం ప్రపంచ పొగాకు రంగంలో స్థిరస్థాయిని పొందగలుగుతుంది.

ఇంకొక నెలరోజులలో నారుమళ్లు పోసేతరుణం ప్రారంభం కానున్నది. కనుక పైచెప్పిన నూతన కార్యక్రమం ఆరంభించడానికి ఇదే తగిన సమయం. రాష్ట్రప్రభుత్వం ఈ విషయాలను గుర్తించి తక్షణమే కార్యక్రమమునకు ఉపక్రమించగలదని ఆశించవచ్చునా?

## సంపాదకునకు లేఖ

### సాంకేతిక కళాశాలల్లో ప్రవేశం

అర్యా, 17-6-54 తేదీన ఆంధ్రపత్రికలో పై శీర్షిక క్రింద ఒక వార్త ప్రచురించబడినది. అందులో మదరాసు ప్రభుత్వమువారు సాంకేతిక కళాశాలల ప్రవేశ విషయములో చేసిన మార్పు చాలా బాగున్నదనియు, మౌఖిక పరీక్షకు 50 మార్కులు చాలవనియు దానిని పెంచింపు చేయవలె ననియు గతరెండు వర్షాల ఆందోళన ఫలితముగా మదరాసు ప్రభుత్వమువారు ఆ మార్పు చేసినందులకు అభినందనీయులనీ, అట్టి మార్పునే త్వరలో ఆంధ్రప్రభుత్వము కూడా తప్పక తీసుకొని రావలెననియు కోరబడినది. ఐ. సి. యస్. మున్నగు వున్నత పరీక్షలలో కూడా మౌఖిక పరీక్షకు దాదాపు 800 ల మార్కులు వున్నందువలన కేవలము పరీక్షలలో వచ్చు మార్కులమీదనే ఆధారపడక అభ్యర్థి యితర గుణములను, వుత్సాహములను పరిశీలించుటకు అవకాశమున్నదని కూడా తెలియజేయబడినది.

కళాశాలల్లో ప్రవేశమునకు గాని యితర వుద్యోగములకు గాని అభ్యర్థుల యోగ్యతలు పరీక్షలలో వారికి వచ్చిన మార్కులపై ఆధారపడక మౌఖిక పరీక్షపై ఎక్కువ ఆధారపడవలె నని కోరుట కోదనీయము.

మౌఖిక పరీక్షకు అధికముగా మార్కుల నుంచమని కోరుట వలన యోగ్యతలు కలిగిన అభ్యర్థిని వదలివేసి వేరొకరిని దొడ్డి దోవన తీసుకొనివచ్చుటకే వుపయోగపడును గాని కేవలము వొక అభ్యర్థి ముఖమును చూచినంత మాత్రమున అతని యితర గుణమును వుత్సాహమును కనుగొనుట దుర్లభము. అందుచేత యోగ్యత కలిగిన అభ్యర్థులను పరీక్షలలో సంపాదించిన మార్కులనుచూచి మాత్రమే సెలెక్టు చేసుకొని సాధ్యమైనంత తక్కువ మార్కులను మౌఖిక పరీక్షకు వుంచినచో అర్హత గలిగిన అభ్యర్థికి న్యాయము తప్పక జరుగగలదు. కావున ఆంధ్ర ప్రభుత్వము సాంకేతిక కళాశాలలకు గాని, యితర వుద్యోగములకు గాని అభ్యర్థులను [illegible] పరీక్షకే ఎక్కువ ప్రాధాన్య మివ్వగలరని ఆశిస్తున్నాను.

పత్తెనపల్లి. గుండిపూడి శ్రీరాములూ 1

# ఆంధ్ర ప్రాంతంలో 'భిక్షాటన వృత్తి'

## విపరీతంగా పెరిగిపోతున్న యాచకుల సమస్య

శ్రీమతి కనపర్తి వరలక్ష్మమ్మ

ఆంధ్ర దేశంలో బిచ్చమెత్తుకొనే వారి సంఖ్య నానాటికీ వృద్ధి అవుతున్నది. కడుపు కొటకొలు అధారం చేసుకొని ఇటు దక్షిణాదివారు అటు ఉత్తరాదివాళ్లు గూడా తెలుగు దేశం మీద వచ్చిపడుతున్నారు. వచ్చే పొయ్యేవాళ్ళే కాకుండా ఒక్కొక్క ఊరిలో వందలకొలది వేలకొలది ముష్టివాళ్లు నిలవగా ఉంటున్నారు. ఇందువల్ల ప్రజల కెంత వేధగా ఉన్నదో అందరికీ అనుభవమే. కుంటి గ్రుడ్డి మొదలైన వికలాంగులు, వృద్ధులు, వ్యాధిగ్రస్తులు మొదలైన అశక్తులు బిచ్చమెత్తుకుంటే తప్పులేదు. వారి నెవరు కాదనరు. వాళ్లు ఏవిధంగాను పోషింపబడవలసిన వాళ్ళే. కాని దృఢకాయులైన వాళ్లు సోమరిపోతుతనం చేతను కులవృత్తి అనే నెపం చేతను, బిచ్చమెత్తడం సహింపరాని విషయం. ఉదయం ప్రొద్దు పొడిచింది మొదలు రాత్రి పదిగంటల ప్రొద్దుపొయ్యేవరకు 'అమ్మా బిచ్చమనో', 'మాదాకబళమనో' ఎడతెరపి లేకుండా బిచ్చగాళ్లు అరవడం వినిపిస్తూ ఉండటం చూస్తే మన దేశపు దారిద్ర్యానికి సోమరిపోతుతనానికి ఇంతకు మించిన నిదర్శనం లేదనిపిస్తుంది. మనది ధర్మదేశం. ఒకరికి పెట్టింది తన పోలనీ, తాను తిన్నది మట్టిపాలనీ, భావించే దేశం. కనుకనే పురాణాల్లో ధర్మశాస్త్రాల్లో ఒకరికి పెట్టినందువల్ల కలిగే పుణ్యవిశేషం విశేషంగా వర్ణింపబడ్డది. కాబట్టి పుణ్యాపేక్ష చేత ధర్మం చేయడమనేది భారతీయులకు సహజస్వభావమై పోయింది. ఈ ధర్మం ఈ జన్మకే కాకుండా మూడు జన్మలకు ముడి వేయబడ్డది. పెట్టిన వారికి పుట్టినదే సాక్షి అనే సామెత ఉన్నది. అంటే ముందు జన్మలో పెట్టినాము కనుక ఈ జన్మలో కొంత అన్న వస్త్రాలు కలిగి ఉన్నామనీ, ఈ జన్మలో పెట్టితే ముందు జన్మలో గూడా కూడు గుడ్డలకు కొరవలేకుండా బ్రతుకవచ్చుననీ విశ్వాసం. దారిద్ర్యం అంటే అంత భయం కల్పించి జన్మజన్మలకు దాని నివారణ మార్గం ఒకరికి పెట్టడమేనని రూఢి పర్చారు మన పూర్వీకులు. అసలు బిచ్చగాడు బిచ్చం వేయమనడంలోనే పుణ్యముంటుందమ్మా కాస్త బిచ్చం వేయమ్మా, కాస్త అన్నంపెట్టమ్మా అని పుణ్యస్మరణ కలుగజేస్తానే బిచ్చం అడుగుతాడు. అబిచ్చం అడగటం తన పొట్ట గడుపుకోటానికి కాకుండా మనకు పుణ్యం ప్రసాదించడానికి వచ్చినట్టుగా ఉంటుంది. ఈ అడగడాన్ని బట్టే తెలుస్తున్నది. ఒకరికి ధర్మం చేయడం వారిని రక్షించడానికి కాకుండా తమ శ్రేయస్కరమనే భావన మనలో జీర్ణించి పోయినట్టు.

మంచి మంచిగానే ఉంటే తప్పులేదు. మంచి చెడుగా పరిణమించినప్పుడు కానక పోవడం మాత్రం అపరాధమే. ఈ బాధ మన దేశంలో ఈ భిక్షుక వృత్తి బాగా వెర్రితలలు వేసింది ఇది ఎల్లరు గమనించాలి.

లేనివారు బిచ్చం అడుక్కొనడం సరే కాని ఇది గౌరవమైన వృత్తిగా భావించడమూ, అందులోను ప్రత్యేకంగా కొన్ని కులాలవారు ఏర్పడి ఉండి నిరంతరము ప్రజలను పీడించడం మాత్రం శోచనీయమనిపిస్తుంది.

సాతానులు, జంగాలు, బుడుబుక్కల వాళ్లు, మాల సుద్దులవాళ్ళు, గంగిరెద్దులవాళ్లు, ఫకీర్లు గోసాయీలు, పాములవాళ్లు, మందులవాళ్లు, కోయలు, చెంచులు దొమ్మరులు లంబాడీలు, ఎరుకలు పగటివేషగాళ్లు, భట్రాజులు విప్రవినోదులు, పంచాంగం చెప్పేవాళ్లు సోదె చెప్పేవాళ్లు, చేతులు చూచేవాళ్లు, మందులిచ్చేవాళ్లు తాయెత్తులు కట్టేవాళ్లు ఒకరా ఇద్దరా లెక్కలేనన్ని కులాలవాళ్లున్నారు. వీళ్లలో కొందరు బట్టలు [illegible], పిల్లనగ్రోవులు, మురళీలు, తంబురాలు [illegible] వాయిస్తూ [illegible] కూడా ముష్టి ఎత్తుతుంటారు. [illegible] బిచ్చమెత్తుకోవడమే వృత్తిగా కలవాళ్లు ఈ దేశంలో ఉన్నంతమంది మరే దేశంలో లేరని చెప్పవచ్చును. త్యాగి వల్లనో, అంగవైకల్యంవల్లనో, వార్ధక్యంవల్లనో విధిగా ముష్టియెత్తుకోవలసిన వాళ్లుండగా కులవృత్తి పేరుపెట్టి దృఢకాయులైన వాళ్లు గూడా ముష్టి [illegible] మనిషి [illegible] కాని [illegible] ఈ ముష్టి [illegible] అని చెప్పబోయాను.

ఒకప్పుడు మత ప్రచారానికో ధర్మ ప్రచారానికో కొన్ని కులాల వాళ్ళకు యాచకులవృత్తిగా నిర్దేశింపబడి యుండవచ్చును. కాని నేడు మాత్రం ఈ ముష్టివాళ్ళు ఈ విధంగా పెరిగిపోవడం దేశానికనర్థమే అని చెప్పాలె. ఈ మధ్య విశాఖపట్నంలో కాబోలు పదివేల మంది బిచ్చగాళ్ళు ఉన్నట్టు పత్రికల్లో చదివాము. ఇక దేశమంతంమీద ఎంతమందియున్నారో!

ముష్టివాళ్లు దేశంలో ఎక్కువకావడంవల్ల ప్రజలకు ఎంతో బాధగా ఉంటున్నది. అనుక్షణం వీళ్ళ పీడనను సహించడం దుర్భరమవుతున్నది.

ఉదయం రెపరెప ప్రొద్దు పొడుస్తూ ఉంటుంది. ప్రాతః కృత్యాలు యింకా తీరనే తీరవు. అమ్మా బిచ్చమంటూ ముష్టివాళ్లు తయారవుతారు. పగలెల్లా సరేసరి రాత్రి తొమ్మిది గంటలు దాటి పోతుంది. మాదాకబళమమ్మా అని బిచ్చగాళ్ళు అరుస్తూనే ఉంటారు. వీళ్ళల్లో సాధారణంగా కుంటి గ్రుడ్డివాళ్లు, ముసలివాళ్లు ఉండనే ఉండరు. కొద్ది మంది పగలు కూలీనాలికి పోయినవాళ్లు గూడా ఉంటారు. మిగతా వాళ్లంతా పనికి లొంగని సోమరిపోతులు. ఏ సంస్కారం లేకుండా రికామీగా తిరిగే బాపతు కావడం చేత ఈ ముష్టి వాళ్ళల్లో దొంగతనము, త్రాగుబోతుతనము తిరుగుబోతుతనము, జూదము మొదలైన సప్త వ్యసనాలు అభ్యాసపడిన వాళ్ళుంటారు. వీళ్ళంతా అమాయకులు పిచ్చివాళ్ళు కారు. అద్భుత ప్రజ్ఞలు కలవాళ్ళెందరో ఉంటారు. కొందరు విజంత్రాన్నైనా ఎంతో చక్కగా వాయించగలరు. కొందరు ఎంతో శ్రావ్యంగా పాడగలరు. కొందరు ఇంద్రజాలమహేంద్రజాల విద్యలు చూపగలరు. చక్కగా ఆకులతో, ఈనెలతో, బద్దలతో నారతో, దారంతో పూసలతో సున్నితమైన సుందరమైన వస్తువులను తయారుచేయగల కళానిపుణులు గూడ వీళ్ళలో ఎందరో ఉన్నారు. సాముగరిడీలు విలువిద్య కనికట్టు హస్తలాఘవం గారడీ ఇంకా ఎన్నెన్నో వింత వింత విద్యలు నేర్చిన వారున్నారు. కాని యాచనా వృత్తి వల్ల వీరి శక్తి సామర్థ్యాలు వృథాపోవడము, వీరు ప్రజలకు భారం కావడము సంభవిస్తూ ఉన్నది.

దేశం బాగుపడవలెనంటే ఈ భిక్షుకులలో కేవలం అశక్తులైన వారికి పోషణ సౌకర్యాలు కల్పించి పని చేయగల వారినందరిని దేశశ్రేయస్సుకు వినియోగించుకోవాలె. ఎవరెవరికి ఏ ఏ పనియందు కుశలత ఉన్నదో ఆయా పనులకు అనుగుణ్యములైన పనులు వారికి నేర్పించాలె. కాయకష్టము చేయగల వారు లక్షలకొలది నిర్వ్యాపారులై బిచ్చమెత్తుకుంటూ తిరగడం దేశానికి అనర్థకం, ప్రజలకు పీడాకరం, ప్రభుత్వానికి ఎంతో నష్టం.

ప్రతిదినము ఇంటింట వద్దా గృహస్థులను యాచిస్తూ వారిని కష్టపెట్టడమే కాకుండా రైళ్ళల్లో బజారుల్లో తీర్థ విశేషాల్లో పడవలవద్ద, బస్సుల వద్ద దేవాలయాలవద్ద, వీరియాచన ప్రజల కెంతో బాధ కలిగిస్తున్నది. వీరిలో అశక్తుల కంటె దృఢగాత్రులే ఎక్కువ మంది ఉంటారు. ఒకవేళ ఏ అవిటి మనిషైనా ఒక మనిషి ఉంటె వాళ్ల వెనుక నలుగురైదుగురు దృఢకాయులుంటారు. ఈ నలుగురైదుగురు సంరక్షణ ఆ ఒక్క అవిటి మనిషి మీద ఉంటుంది. ఇది సుఖజీవనం కాదు. యాచన చాపల్యంతో సమానం. కాని ఆ హైన్యాన్ని తెలుసుకొనే సంస్కారం ఆ మనుష్యుల్లో లేకపోవడమే యీ దైన్యానికి పాల్పడడానికి కారణం. అందాల కంటె చక్కని చుక్కల్లాంటి పిల్లలు, ఏచివిగిన గుడ్డ పేలికో చొక్కా గుడ్డో నడుముకి చుట్టిపెట్టుకొని ఒక చేతిలో తగిలించుకున్నో ఒక ఎల్యూమినియం గిన్నె, ఒక సుట్టేనాలో చంకపెట్టుకొనో, మా అయ్య అమ్మ చచ్చిపోయినారని తలిదండ్రులు చెప్పిన అబద్దాలను గట్టిగా వల్లిస్తూ ఇంటింట అత్యంత దీనంగా అడుక్కుంటూ ఉంటే ఛీత్కారాలు తింటూ ఉంటే చూడటానికి ఎంతో దుస్సహంగా ఉంటుంది. అడుక్కొ తినడంలో ఉండే హైన్యం పెద్దవాళ్ళకే తెలియక పోతే ఆ పసివాళ్ళకేమి తెలుస్తుంది? ఆ ఛీత్కారాలతోనే వాళ్ళు పెద్ద వాళ్ళయిపోతూ ఉంటారు. పనిపాటలకు శరీరం లొంగదు. వయసు వస్తుంది. కోరికలెక్కువతాయి. అడుక్కోడం వల్ల అవి తీరవు. అందువల్ల దగా, మోసం, రాని వైద్యాలు చేయడం, తెలియని మంత్రాలు పెట్టడం. అవీ ఇవీ చెకపోతే దొంగతనము పట్టుబడితే జైలుకు పోవడం లేకపోతే వానిలో [illegible] మళ్లీ వాళ్లింతే. మానవజన్మ యొక్క విశిష్టత, ఉత్కృష్టత వాళ్ళకు బోధపడుటమంటూ ఉండనే ఉండదు. దయా సత్య శౌచాలు వారినంటనే అంటవు. మానవజన్మ యొత్తి దాని విలువ కొంచమైనా తెలియబడకుండానే ఇతర జీవరాసులెట్లా పుట్టి గిట్టుతున్నాయో ఈ మానవులు గూడా అట్లాగే పుట్టిగిట్టుతూ ఉంటారు. వీరు మానవులై పుట్టి చేసేపనితో డి మానవులను పీడించడం, ఎక్కడికి వెళ్లినా వీరే ప్రత్యక్షం. ఆచెయి చాపడానికి అంతు ఉండదు.

ఈ విధంగా లక్షలకొలది ప్రజలు సోమరిపోతులై కాయకష్టం చేయకుండా భిక్షుక వృత్తిలో జీవించడం చేత సంఘానికి భారంగా ఉన్నారు. కొనుక్కుందామన్నా చిట్టెడు గింజలు పుట్టని రేషనింగురోజుల్లో గూడా ఈ భిక్షుకులపీడ వదల లేదంటే దేశ ప్రజలు వీరివల్ల ఏంతబాధ పడుతున్నదీ తెలుస్తూనే ఉన్నది. వేలకొలది లక్షలకొలది కుటుంబాలు భిక్షాటనమే వృత్తిగా జీవిస్తుంటే దేశం ఆర్థికంగా క్రుంగి పోవడంలో ఆశ్చర్యమేమున్నది?

### నివారణోపాయాలు

దేశం బాగుపడవలెనంటె ప్రాజెక్టులు నిర్మించడం పరిశ్రమలు వృద్ధిపొందించడము, ఎంత ముఖ్యమైనదో కాయకష్టం చేయగల భిక్షుకులను, భావిపౌరులు కావలసిన భిక్షుకుల పిల్లలను, బిచ్చమెత్తకుండా శాసనరీత్యా నిషేధించి బలవంతముగానైనా వారికి బ్రతుకు తెరువులు చూపడం బాగుచేయడం చాలా అవసరం.

ఈ శాసనం మద్రాసులో లాగ ఆ పట్టణానికి వర్తింప జేసి వాళ్లను ఇతరుల ఊళ్లకు తరిమితే లాభంలేదు. బొంబాయిలో లాగా హైద్రాబాదులో తెచ్చి వదలితే లాభంలేదు. దేశమంతటా ఈ శాసనం ఒకేమారు అమలులో పెట్టాలె. భిక్షుకుల్లో పెద్దవాళ్లచేత పనులు చేయించాలె. పిన్నవాళ్ళకు విద్యాబుద్ధులు నేర్పించాలె. ఇందు నిమిత్తం ప్రజలవద్ద కొద్దిగా వార్షికమైన పన్ను వసూలు చేసినా తప్పులేదు. శరణాలయాల్లో చిన్నతనం నుంచే ఈ భిక్షుకుల బిడ్డలకువిద్యాబుద్ధులు నేర్పించి బాగుచేసినట్లయితే దేశప్రతిష్ఠను ఇనుమడింప జేయగల జాతిరత్నాలెన్నో వీరినుండి వెలువడ గలరు.

తెలుగు దేశాన ఉన్న అసంఖ్యాక భిక్షుక జనమే కాకుండా, అనవరతం కాశీ నుండి రామేశ్వరం దాకా యాత్రచేస్తూ బిక్షమెత్తే ఉత్తరదేశపు భిక్షుకులే కాకుండా దక్షిణాది నుండి పారలి వచ్చిన అరవ భిక్షుకుల సంఖ్య గూడా తెలుగు దేశంలో చాలా ఎక్కువైంది. ఈ అరవవాళ్లు ఇటీవల కుటుంబాలు కుటుంబాలుగా వచ్చి తెలుగు నాడంతా నిండిపోయినారు. ఊళ్ళలోను రైళ్ళలోను గూడా వీరి యాచనాపీడ జాస్తిఅయిపోయింది. వీరి దేశమేమయిందో, వీరిపాడిపంటలుఏమయినాయో, తెలుగువాళ్ళకంటె ముందుగా ప్రాజెక్టులు నిర్మించుకొని కావేరిజలం ఒక్క చుక్క వృథాకాకుండా నీటివనరు లేర్పరచుకున్న వీరి సౌకర్యాలేమైనాయో తెలియదు. భిక్షుకవృత్తిలో తెలుగుదేశమంతా పరుచుకున్నారు. ఎవరైనా భిక్షం లేదంటే వీళ్ళకు పట్టరాని కోపం. అరవంతో గట్టిగా తిట్టిపోస్తారు. 'చాలా గొప్ప ధర్మదేశంరా'అని అవహేళన చేస్తారు. ధర్మదేశం కాదనైనా యీ తెలుగుదేశాన్ని వాళ్లు వదలిపోతే బాగానే ఉండును. కాని వదలి వెళ్లరు. 'సాంబసదాశివ' 'సాంబసదాశివ!' అంటూ ఇక్కడే ఉండిపోతారు. ఇప్పుడు తెలుగు దేశాన పల్లెల్లోగాని, పట్టణాల్లో గాని అరవ బిచ్చగాళ్ళు లేని ఊరు లేదు. వీళ్లనిట్లా పెచ్చరిల్లనిస్తే వీళ్లను పోషించేకష్టమట్లా ఉంచగా తామెచ్చట అధికంగా చేరితే ఆ ప్రాంతమంతా మాదేననే ప్రమాదం గూడా వీరి వల్ల ఉన్నది. మద్రాసేమైంది? దాని పరిసర తెలుగు ప్రాంతమంతా ఏమైంది? మనం అనుభవ పూర్వకంగా తెలుసుకొనే ఉన్నాము. ఉత్తర దేశస్థులూ వస్తారు వాళ్లు ఏ వూరు వచ్చినా రెండు మూడు రోజులుండి ముందూరికి వెళ్లి పోతూ ఉంటారు. ఎక్కడ గాని పీటలు పెట్టుకొని ఉండరు. అరవవాళ్లు వస్తే వదలి పోవడమంటూ ఉండదు. పొట్టగడిచినచోట పే పట్టం కట్టుకొనే శక్తివారికి ఉన్నది. ప్రభుత్వం ఈ ప్రమాదాన్ని ఒక కంటకనిపెట్టి ఉండాలె. ముప్పై లక్షలమంది ఆంధ్రులు దక్షిణ దేశంలో ఉన్నారు. కిక్కురు మనరు. కాని వీరు పదిమంది చేరిన పల్లె మాదే అంటారు. ఇక రైళ్ళలో అరవ బిచ్చగాండ్లవల్ల పడుతున్న ఇబ్బందులు అందరికీ అనుభవమే. చేలకాసులేకుండా వాళ్లు మద్రాసుపోతూ వస్తూ ఉంటారు. టిక్కెట్ కలెక్టరు యీ పెట్టెలో దించితే ఆ పెట్టెలోకి ఎక్కుతూ ఉంటారు. రైలు నడుస్తూ ఉండగా ఎక్కడం వారికి చేతనైనట్టు రైల్వే ఉద్యోగులకు కూడా చేతకాదేమో, ఈభిక్షుగాళ్ల మూలంగా రైలు ప్రయాణాలలో భద్రమేపోయింది. ఎవరేది పట్టుకొని దిగిపోతాడో అని ప్రయాణికులకు ఎప్పుడూ భయమే. ఏవిధంగా చూచినా దృఢగాత్రులైన వారు బిచ్చమెత్తుకోడం దేశానికి అనర్థకం. ప్రజలకు ప్రభుత్వానికి గూడా వీరివల్ల చాలా కష్టమున్నది. కాగా ఆంధ్ర ప్రభుత్వం పరిష్కరించవలసిన తక్షణ సమస్యలలో భిక్షుకుల సమస్య ఒకటి. ఇది ఎంత త్వరగా పరిష్కరిస్తే ప్రజలకు ప్రభుత్వానికి అంత శ్రేయస్కరం. శాసనసభ్యులైనవారు దీనిని గమనించి ప్రభుత్వ పరిశీలనకు తెస్తే ప్రజలకెంతైనా మేలుచేసినవారు కాగలుగుతారు.

## గ్రంథసమీక్ష

### వాణీవిలాస వనమాలిక

తేకుమళ్ల రంగశాయికవి. సంపాదకులు: టి. చంద్రశేఖరన్. క్యూరేటర్, గవర్నమెంటు ఓరియంటల్ మాన్యు స్క్రిప్ట్సు లైబ్రరీ, మద్రాసు. 9-6-0.

ఇది మదరాసు ప్రాచ్య లిఖితగ్రంథాలయమువారు ప్రకటించిన అపూర్వాంధ్ర గ్రంథము.

ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో నిఘంటువులున్నాయి గాని విజ్ఞాన సర్వస్వాలవంటి వివిధ విజ్ఞాన నిఘంటువులులేవు. ఇది తేకుమళ్ల రంగశాయి కవి పద్యాల్లో రచించిన వివిధ విజ్ఞాన సర్వస్వము.

సంస్కృత వాఙ్మయంలో కూడా ఇలాంటి విజ్ఞాన సర్వస్వాలు లేనప్పుడిటువంటి విజ్ఞాన సర్వస్వ రచనలో తేకుమళ్ల రంగశాయికవి ఎలాంటి వినూతనమార్గం అవలంబించాడో గ్రహించవచ్చును.

ఈ కవి కాలం నిర్ణయించడానికి అంతగా స్పష్టమయిన ఆధారాలేవీ లభించడంలేదుగాని ఇతడు రచించిన ద్విపద భాగవతంలో పుష్పగిరి తిమ్మన్నను తన సహాధ్యాయిగా పేర్కొన్నాడు. ఈ పుష్పగిరి తిమ్మన్న 18వ శతాబ్ది ఉత్తరార్థంలో జీవించి ఉన్నాడని ఆంధ్రకవులచరిత్ర నిశ్చయించింది. ఈ కారణంవల్ల తేకుమళ్ల రంగశాయి కవికూడా ఈ కాలంలో నివాసే అయిఉండవచ్చునని గ్రంథ సంపాదకులూహిస్తున్నారు.

ఈ గ్రంథంలో నాలుగు అధ్యాయాలున్నాయి. ఈ నాలుగు అధ్యాయాల్లో ప్రాచీన శరీరశాస్త్ర విజ్ఞానం యీ పద్యాల సంగ్రహంగా పద్యరూపంలో క్రోడీకరింపబడి ఉన్నది. ప్రథమాధ్యాయంలో ఆయాద్వీపాల వర్ణనము, సృష్టివర్ణనము మొదలైన విషయాలున్నాయి. ద్వితీయాధ్యాయంలో భారత దేశంలోను, ఆంధ్ర దేశంలోను ఉన్న పుణ్యక్షేత్రాలు, దేవాలయాలు మొదలైనవాటి వివరణలున్నాయి. తృతీయాధ్యాయంలో దానస్నానాది ధర్మకార్యాల మహిమలు, వేదాంత స్వరూప వివరణము మొదలైన విషయాలెన్నో [illegible]. ఇక నాలుగవ అధ్యాయంలో [illegible] స్వతంత్ర శాస్త్రాలన్నీ సంగ్రహంగా క్రోడీకరింపబడ్డాయి.

సంపాదకులు, సి. పి. బ్రౌను ఆంగ్ల భాషలో ఈ గ్రంథాన్ని గురించి వ్రాసిన విషయ వివరణమంతా చేర్చి ఉండడంవల్ల కేవలం ఆంగ్లభాష తెలిసినవారుకూడా ఈ గ్రంథస్థ విషయాలవగాహన చేసుకోడానికి వీలిచ్చింది.

అయితే సంపాదకులు విషయసూచికలో సూచించిన విషయాల శీర్షికలు గ్రంథంలోకూడా ముద్రించి ఉంటే ఆయా విషయ పరిశీలన కింకా బాగా సుకరంగా ఉండేది.

తేకుమళ్ల రంగశాయికవిత ఆయా విషయాల ననుసరించి చాలా సరళమైన శైలిలో సాగిపోతుంది.

అపూర్వమైన ఈ ప్రాచీన విజ్ఞాన సర్వస్వప్రకటనలో సంపాదకులు బాగా శ్రద్ధవహించారు.

ప్రాచీన విజ్ఞాన స్వరూపం అవగాహన చేసుకోదలచినవారికీ వాణీవిలాస వనమాలిక ఎంతైనా ఉపయోగిస్తుంది.

### శ్రీ శారదా దేవి చరిత్ర

శ్రీ చిరంతనానందస్వామి. ప్రకాశకులు శ్రీరామకృష్ణమఠము మైలాపూరు మద్రాసు 4. వెల రెండురూపాయలు.

శ్రీ రామకృష్ణ పరమహంసచరిత్ర ప్రాచ్య పాశ్చాత్య పాఠక లోకంలో బాగా ప్రసిద్ధికెక్కింది. పరమహంస పత్నిమణి శ్రీ శారదామణి జీవచరిత్ర కూడా మహోత్తమైనదే. స్వయంగా ఈమెకు శిష్యులైన వారనేకులు భారతదేశంలో ప్రసిద్ధులై రామకృష్ణ సందేశం నలుదిక్కులా వ్యాపింపచేశారు.

అయితే ఆమె చరిత్ర పరిశీలిస్తే పాఠకులకు ప్రాచీనార్య మహిళా సంప్రదాయం ఆమెలో మూర్తీభవించినట్టు స్ఫురింపగలదు.

కాని రామకృష్ణ పరమహంసచరిత్ర రచనలో జరిగినంత విశేషప్రయత్నం ఈమె చరిత్ర రచనలో జరగలేదు.

శ్రీ చిరంతనానంద స్వామి ఆంగ్లవంగభాషల్లో సంగ్రహించిన విశేషాలతో ఈ గ్రంథరచించి ఆంధ్ర పాఠకుల కందించారు.

వీరి రచన మనోహరమైన శైలిలో సాగిపోతూ అడుగడుగునా పాఠకులలో కౌతూహలం రేకెత్తిస్తున్నది.

### కాశీమహా క్షేత్ర వైభవము

[illegible]

కాశీమహా క్షేత్రవైభవ [illegible] ఇంతవరకు పూర్వం అనేకులు ముద్రించారు. సాధనగ్రంథమండలి వారిప్పుడు దీనికి ద్వితీయ ముద్రణం ప్రచురించారు.

ఈ ముద్రణంలో వీరు కొన్ని ముఖ్యమైన పాఠాంతరాలే కాక కొన్ని కఠినమైన పదాలకు అర్థాలు కూడా చేర్చారు.

[illegible] సాధనగ్రంథమండలి వారభినందనీయులు.

## వారఫలాలు

జూలై 4-వ తేదీ మొదలు 10-వ తేదీ వరకు

### గ్రహస్థితి

రవి, బుధ, గురులు (మిధునం) కుజ రాహువులు (ధనుస్సు) శుక్రుడు 7 సా॥ 5 గం. 11 ని. వరకు (కర్కాటకం) తరువాత (సింహం) శని (తుల) చంద్రుడు (సింహ, కన్య, తులల్లో).

### రాశ్యంతర గ్రహయోగములు

4. బుధ, కేతు (యుతి) 6. రవి, బుధ (యుతి) 7. రవి, కేతు (యుతి) 6. శని (ఋజుర్వక్రి).

### మార్కెట్టు (ధరలు) మార్పులు

జారిల్లా (ప్రత్తి) వాయిదా నూలూ, వస్త్రాలూ

ముఖ్యగ్రహయోగములు వాయిదా వ్యాపారాలను తగ్గించ ప్రయత్నించును. కాని గ్రహరాజు పునర్వసూ నక్షత్ర సంచారం క్రిందికి దిగనివ్వదు. నూలు, వస్త్రాల వ్యాపారస్థుల పరిస్థితి అస్థిరంగా యుంటుంది.

### వెండి బంగారములు

రవికి, బుధ కేతువులతో కలయిక, శని ఋజుర్వర్తనం ఆకస్మాత్తు మందాన్నే కలిగియున్నది. హెచ్చినప్పుడంతా అమ్మి 8, 9ల్లో మందాన్ని గమనించుకోవడం మంచిది.

### ధాన్యములూ, ఇతర ఆహార దినుసులూ

వరీ, గోధుమలూ మందంలోనే యుంటవి. వరిగెలు, జొన్నలు మొదలగునవి మరికొంత తగ్గును. మిర్చీ, చింతపండూ నిలకడగా యుండును. బెల్లము (అకస్మాత్తుగా) మందం కావచ్చును. నూనెలూ, వేరుశెనగలూ (వాయిదాయున్న) అమ్మడంమంచిది. ముఖ్యగ్రహపరిస్థితులు ఎగుమతులకూ, దిగుమతులకూ అవకాశం ఇవ్వవు.

### రైతులకు

అన్ని వ్యవసాయ ప్రయత్నములకూ పశువులు కొనడానికి 6, 10 తేదీలు మంచిది. 8, 9 బొత్తుగా పనికి రావు.

### వాతావరణము

దక్షిణదేశమున సకాల వర్షములు కురియును. సింధు, గంగా, బ్రహ్మపుత్ర, యమునలు ప్రవహించును. పరిస్థితులు రైతులకు శుభసూచకమగును.

### మీ లగ్న (రాశి) ఫలం

**మేషం** (అశ్విని, భరణి, కృత్తిక 1-వ పాదం)

ఈ వారంలో రవి శుక్రులు అనుకూలురు. పరిస్థితులు స్వల్ప మార్పులతో గత వారంలోలాగే యుంటవి. స్వల్ప అనారోగ్యానికి వీలుంటుంది. ధైర్యంతో దిగిన వ్యవహారాలలో సంతృప్తియుండదు. కుటుంబ పరిస్థితులు కొంత విశ్రాంతి నివ్వకలవు. వారాంతంలో వ్యాపార వృత్తుల్లో కొంతఅనుకూలత యుంటుంది. దూరంలో యుండి వచ్చిన మిత్రులను కలుస్తారు. 6, 7 పెట్టుబడులకూ ప్రయాణానికీ కొంత అనుకూలం.

**వృషభం** (కృత్తిక, 2,3,4 పాదాలు రోహిణి, మృగశిర 1, 2 పాదాలు)

ఈ వారంలో గురు శుక్ర శనులు అనుకూలురు. మీ కుటుంబంలో యున్న శుభులు (బుధ గురువులు) అస్తంగతులగుటకు కారణంగా ఆర్థికంగా అసంతృప్తికరమైన పరిస్థితులు కలుగుతవి. పైగా బంధువుల కారణంగా మాటలు కలహాలుగా మారవచ్చు. కొంత జాగ్రత్త అవసరం. శుక్రచలనం కారణంగా ఉద్యోగ వృత్తుల్లో కలిగే అవకాశాలను వినియోగించుకొనలేక పోతారు. ఆరోగ్యం నిలకడగా యుంటుంది. 9, 10 ప్రయాణానికీ ప్రయత్నాలకూ అనుకూలం.

**మిథునం** (మృగశిర 3, 4 పాదాలు ఆర్ద్ర, పునర్వసు 1 2 3 పాదాలు)

ఈ వారంలో శుక్రుడుమాత్రంఅనుకూలుడు. 7 తర్వాత కొంత అనుకూలం అన్ని రంగాలలోనూ అగపడుతుంది. పగవారి తొందరలు కొంత తగ్గుతవి. వ్యాపారస్థులకు పరిశోధసమయం. క్షారబలం సదవకాశాలకు వీలు ఇవ్వకపోవడమే కాకుండా నష్టసమయంలో పెట్టుబడులకు అవకాశం ఇస్తుంది. అందువల్ల పరిస్థితులు తారుమారు అవుతవి. సంఘంలో సంతోషం కలిగించేవారుంటారు. 5, 6 ప్రయాణానికీ ప్రయత్నాలకూ మంచిది.

**కర్కాటకం** (పునర్వసు 4వ పాదం పుష్యమి, ఆశ్లేష)

ఈ వారంలో కుజ శుక్ర రాహువులు అనుకూలురు. ప్రస్తుతం మీకు ప్రాప్తి అనుకూలురు కుజ శుక్రులే. కాని వక్రుడు. మీరుఎంతో ఉత్సాహంలో వ్యాపారవృత్తుల్లో సంకల్పాలు చేస్తారు. కాని ప్రవేశించేసరికి ముందుకుగుకు ఆటంకాలు కలుగుతవి. అందువల్ల ఆశాభంగం కలుగుతుంది. సామాన్య పరిస్థితుల్లో కావలసిన డబ్బుకు 7 తర్వాత శ్రమ కలుగదు. కోర్టు వ్యవహారాలలో వ్యతిరేకత యుంటుంది. 6, 7, 8 ల్లో ప్రయాణ ప్రయత్నాలకు అనుకూలం.

**సింహం** (మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం)

ఈ వారంలో రవి, బుధ, గురు, శుక్ర, శనులు అనుకూలురు. గ్రహబలం మీకు అన్ని రంగాలలోనూ సహాయపడుతుంది. శుభ పుణ్య కార్యాల పేరులో బంధువులకు సహాయ సహకారంలో కొంత డబ్బు ఖర్చు అయినా మిగులుతుంది. జీవితంలో ఉపయోగించగల వృత్తుల్లో సక్రమమైన పెట్టుబడులు చేయకలుగుతారు. 6, 7, 8 ల్లో స్వల్ప ఆరోగ్యభంగం చికాకు కలిగించకలదు. బంధువుల వల్ల విసుగు కలుగుతుంది. వారాంతంలో చిన్న ప్రయాణం. మిత్రులవల్ల మనశ్శాంతి.

**కన్య** (ఉత్తర 2, 3, 4 పాదాలు హస్త, చిత్త 1, 2 పాదాలు)

ఈ వారంలో రవి, బుధ, శుక్రులు అనుకూలురు. మీ ఇరుగు పొరుగు పరిస్థితులు సంతృప్తి నివ్వవు. కాని ఓర్పులో అన్ని వ్యవహారాలూ సర్దుబాటు చేసికోవడం కలుగుతుంది. ఇతరులు తొందరవల్ల కొంత (మానసిక) అశాంతి కలిగి ముఖ్య వ్యవహారాలలో తారుమారు ఏర్పడుతుంది. ఆస్తి సంపాదనలేక అభివృద్ధి ప్రయత్నాలు నెరవేరవు. రైతులకూ కొంత ప్రతికూల కాలం. ఉద్యోగంలో అధికారుల తొందర కొంత ఓర్చుకోవలసి యుంటుంది. 10 జాగ్రత్త, అశాంతి.

**తుల** (చిత్త 3, 4 పాదాలు, స్వాతి విశాఖ 1, 2, 3పాదాలు)

ఈ వారంలో కుజ, గురు, రాహువులూ 7 నుండి శుక్రుడూ అనుకూలుదు. 7 తర్వాత వెనుకబడిన బాధ్యతగల వ్యవహారాలను దారికి లాగడానికి అవకాశాలు కలుగుతులది. వ్యాపార వృత్తుల్లో మిత్ర సహాయం కార్యసాధనా కలుగుతుంది. వాతావరణ స్థితి ఆరోగ్యంలో కొద్ది అననుకూల మార్పులు కలిగించగలదు. ప్రయాణంవల్ల కొంత చికాకు ఏర్పడుతుంది. మిత్రుల శ్రేయస్సునుగురించి వమర్శలు సంతోషం కలిగించగలవు. వారాంతంలో మిత్ర సమాగమం సంతోషం.

**వృశ్చికం** (విశాఖ 4 వ పాదం అనూరాధ, జ్యేష్ఠ)

ఈ వారంలో బుధుడూ 7 వరకు శుక్రుడూ అనుకూలురు, మీ పరిస్థితులు ముందుకు నూయీ-వెనుకకు గోయిగా యుంటవి. ఎటు పోనూ తోచదు. ఉద్యోగ వృత్తుల్లో విసుగు కలుగుతుంది. కొందరికి సహాయపడ లేవందులకు విచారిస్తారు. ఆర్థికంగా ఇతరులకు సరియైన జవాబు ఇవ్వలేక పోతారు. కుటుంబంలో సంతృప్తి కలుగదు. సంఘంలో గౌరవాధిక్యత ఏర్పడుతుంది. వారాంతంలో వృథా వ్యయం. శ్రమ. అసంతృప్తి.

**ధనుస్సు** (మూల, పూర్వాషాఢ ఉత్తరాషాఢ, 1వ పాదం)

ఈ వారంలో గురు, శుక్ర, శనులు అనుకూలురు. సప్తమంలో గ్రహస్థితి మిమ్మ ముందుకుసడవనివ్వదు. భార్య బిడ్డల ఆరోగ్యవిషయంలో కూడా కొంత జాగ్రత్త అవసరం కావచ్చు. ప్రతిచిన్న ప్రయత్నానికీ ఎన్నోచిక్కులను వదిలించుకోనవలసి యుంటుంది. సహనం అవసరం. వ్యాపార వృత్తుల్లో సాహసంమంచిదికాదు. స్థిరాస్తి అభివృద్ధిప్రయత్నాలు 7 తర్వాత కొంత అనుకూలంగా యుంటవి. వారాంతంలో ప్రయాణం, పెట్టుబడులూ అనుకూలింపగలవు.

**మకరం** (ఉత్తరాషాఢ, 2, 3, 4 పాదాలు శ్రవణం ధనిష్ఠ1,2,పాదాలు,

ఈ వారంలో రవి, బుధులూ 7 నుండి శుక్రుడూ అనుకూలురు. 7 తరువాత కొంత అనుకూలం. ఆస్తిసంబంధమయిన పేచీవ్యవహారాల్లో అనుకూలత కలుగుతుంది. కుటుంబంలో పేచీలు కలిగించి తమాషచూచేవారు వదులుతారు. కుటుంబ ఋణాలు తగ్గుతవి. ఉద్యోగవృత్తుల్లో కూడా కొంత అనుకూలత కలిగి వారాంతంలో లాభం పొందుతారు. వారాంతంలో చిన్న ప్రయాణం, ప్రియబంధు సమాగమం. సంతోషం.

**కుంభం** (ధనిష్ఠ 3, 4 పాదాలు, శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో కుజ, గురు, రాహువులు అనుకూలురు. అస్తంగతుడయిన (కుటుంబ లాభాధిపతియైన) గురుని వల్ల మీకేమీలాభంకలగదు. ప్రతిక్షణము డబ్బుకు ఎదురుచూడవలసి వస్తుంది. రావలసినది సమయంలో రాదు. అందువల్ల సదవకాశాలు కలిసివినియోగించుకొన లేనందుకు విచారిస్తారు. ఆరోగ్యం నిలకడగా యుంటుంది. మానసికంగా కొంత అశాంతికలిగించే ఆలోచనలు తగ్గుతవి. మిత్రులనుగురించి ఆతురత కలుగుతుంది.

**మీనం** (పూర్వాభాద్ర 4 పాదం ఉత్తరాభాద్ర, రేవతి)

ఈ వారంలో కుజ, బుధులూ 7 వరకు శుక్రుడూ అనుకూలురు. పరిస్థితులలో గమనించతగినమార్పులు యుంటవి. 7 తర్వాత [illegible] ఆటంకాలు ఏర్పడుతవి. వ్యాపారవృత్తుల్లో వారాంతంలో ఆశాభంగానికి అవకాశాలు కలుగుతవి. [illegible], షట్లా వ్యాపారాలూ, పేకాటలూ మొదలైన సాహసకార్యాలకు దిగవద్దు. సర్కసుల్లో ప్రవేశంకలవారికి ప్రమాదాలు ఎక్కువ. వారాంతంలో విశ్రాంతి అవసరం.

# ఏది 'ప్రజా కవిత్వం'?

శ్రీ పల్లా బ్రహ్మానందం

ఈ కాలంలో అభ్యుదయ (ప్రజా) కవిత్వం పేరిట వివిధరకాల కవితాలు ఉత్పన్నమౌతున్నై. వీనిలో కొన్ని దారితెన్నూ, ఏమీ కనపడదు. కాగితంమీద కలంపెట్టగలవాళ్లా యేవో నాల్గు మాటలు గిలకడం, అదొక మహాకావ్యంగా నలుగురు భట్రాజులచే పొగిడించుకోవడం సహజమైపోయింది. పైగా ఇందులో వచనానికీ, గేయానికీ భేదంకనబడదు. యీ ఆధునిక యుగంలో మహాతల్పాష్టమై మంజులభాషతో మధుర భావాల్లో ఒప్పారిమన్నన లందిన మనకవిత్వం యిలా వక్రమార్గాల్లో పడింది అంటే విచారించం దెవ్వరు? కాని నా యీవిచారానికి అపహసిస్తారు అభ్యుదయ కాముకులమనుకునే వాళ్లు! అయినా యీ ప్రజాస్వామ్య యుగంలో యేదో కొద్దో, గొప్పో భావ ప్రకటనా స్వాతంత్ర్యం ఉంది గాబట్టి నా ఆవేదన నివేదించుకుంటాను.

ఏమిటి వివిధ రకాల కవిత్వాలు? వీనిసృష్టికారకుల ఉద్దేశ్యమేమిటనే ప్రశ్నకు సమాధానం అగోచరం. వారి నుండి వచ్చే సమాధానమల్లా ఇది ప్రజా కవిత్వమని అంగీకరించమని. పోనీ ప్రజా కవిత్వమనుకోండి. కాని అభావ భావాలు అందరూ అంగీకరించి ఆమోదిస్తున్నారా అంటే లేదు. పైగా ప్రజాకవిత్వం అంటే ప్రజలకందరకూ ప్రయోజనకారిగా ఉండి వారిని సంస్కరించి వారికి అందుబాటులోవుండే భావాలతో, ఎల్లరకూ అవగాహనమయ్యే శైలిలో ప్రజానీకానికి ప్రయోజనకారిగా ఉండాలి గదా? నేడు ప్రబలంగా ప్రచారంలో ఉన్న ఈకవిత్వంగాని, తత్ కర్తలుగాని ప్రజాబాహుళ్యంలో ఏవిధమైన మార్పు తేగలిగారు? ఎటువంటి సామాన్యభాషలో వ్రాసి వారినానంద పర్చగలుగుతున్నారు? వీరు వ్రాసే భావ (గేయకర్తలు) ప్రజలందరికీ అర్థమౌతోందా? ప్రజోపయోగమైన భావాల్లోనే వ్రాస్తున్నారా? ఒక పామరుణ్ణి "ప్రస్థానం" అంటే ఏమిటంటే సమాధానం చెప్పగలడా? లేదు. వెల వెల పోతూ తెల్లమొగం వేస్తాడు. పోనీ విద్యార్థుల్లోనైనా కనీసం వీరి భావాలకు అర్థం తెలిసినవారున్నారా అంటే అదీ అనుమానాంశనీయమే. దీన్ని బట్టి ఆలోచిస్తే తోచేది అధిక సంఖ్యాకులకు అర్థంకానిదే ప్రజాకవిత్వమని. అలాటప్పుడు "ప్రజాకవిత్వం" అన్న దానికిగాని ప్రజాకవులన్న వారికిగాని సార్థకత కూడ?

## భాషా సాంకర్యం

ఈక్రింది గేయాన్ని పరిశీలించండి.

"ఝూర్ వాల్ సార్టు సౌండింబస్
ఎగ్జిస్టెన్షియాలిజం
..................
సబ్ సూపర్ రియాలిజం"

ఇది ప్రజాకవిగా ప్రణుతులందిన ఓ మహాకవి రచనల్లోని మచ్చుతునక. ఈ గేయాన్ని చదివిన తరువాత ప్రతివారికి స్ఫురించేభావం ఏమిటి? ఆంగ్లమా? ఆంధ్రమా! లేక రెండిటి సమ్మేళనంలో ప్రచురించిన సంకరభాషా? ఇదా (ప్రజా) గేయకవిత్వం? తమ గేయాల రచనకు మాతృభాషలో, సరళమైన భాషలో పదాలే కరువైపోయినవా? వివిధ భాషల్లో ఏవేవో పదాల నేరి ప్రయోగించినందువలన వానిని అతి సులభంగా ప్రజలు అర్థంచేసుకుంటారనేనా వీరి భావం? ఏభాషకు సంబంధించినంతవరకు ఆ భాషావాది అర్థం చేసుకోగల్గుతా ననుకొన్నా అవచనం యొక్క ఉద్దేశ్యం, ప్రతి భాషలోను అసంపూర్తిగాక అర్థం చేసుకోబడుతోంది గదా? "సౌండించిన" "ఎగ్జిస్టెన్షియాలిజం" "సబ్ సూపర్ రియాలిజం" అన్న పదాల్లోగల అర్థంగాని, ఆపద ప్రయోగ పాటవాన్ని గాని గ్రాహ్యంచేసుకోగల వారెవరు? ప్రజాకవిత్వంలో ఉండే భావాల్ని, భాషను, మాతృభాషలో ఉంటేనే అర్థం చేసుకోలేని స్థితిలో ఉన్న ప్రజలకు (ఈ మాటకు ప్రజల్ని మూర్ఖులుగా చిత్రిస్తారా అని వారాగ్రహపడతారు) ఈ ఆంగ్లభాషా పద ప్రాయిత్య కవిత యేమిటి? వీరి భావనలో ఆంగ్లం తెలిసిన వారే ప్రజలా? కారా? అలాంటప్పుడిది ప్రజాకవిత్వ మయే సావకాశం యేది? ప్రాసకుపరిపోయినందునా, విన సొంపుగా ఉన్నదిగదాన్ని భావంతో మరో భాషలో సంసర్గం చేసి? ఏవో అవాకులు చెవాకులలో, ఏదో గేయం తయారైందిలే, అన్న భావంతో ఒక సామాన్యుడు, కవితా చాతుర్యం లేనివాడు వ్రాసినట్లు ప్రజాకవులుగా చెలామణీ అవుతున్న వారు వ్రాసే గేయాలా యివి? దీన్ని బట్టి నేటి గేయ (ప్రజా) కవిత్వస్థితి పాఠకులకు చెప్పపండానే అవగాహనమైందనుకొంటాను. అయితే ప్రజాకవిత్వంలో ఆంగ్లభాషా ప్రయోగం చేయాలంటే చేయవచ్చు. కాని అది యేపరిస్థితుల్లో అనేది కూడా ప్రశ్నే. ఉర్దు,ఇంగ్లీషు మొదలగు భాషల్లోని కొన్ని పదాలు తెలుగులోకి వచ్చినై. వాటిని సామాన్య ప్రజకూడా తెలుగు భాషలాగానే వాడుతున్నారు. మచ్చుకు స్కూలు, స్టేషన్, రోడ్ మొ॥ మరి యీపదాలు వాడితేనే ప్రజలకు యీసందర్భాల్లో అర్థమౌతుంది. లేక నానికిగల తెలుగు పదాలను వాడితే ప్రజలకర్థంగాక అదేదోవింతగా వారికితోచి అర్థం కాదు మరి ఈ గేయాల్లో వాడబడుతున్న వటువంటి పదాలా అంటేకాదు. కేవలం తమ ఆంగ్లభాషా ప్రావీణ్యం ప్రదర్శించుకోవాలనే దృష్టిలో ఆ పదాలను వాడినట్లుగా స్పష్టమౌతోంది. లేకపోతే, ఈపదాలేకపోతే అరటికల అర్థం ప్రజలకందదా?

ఇందులో మరో విచిత్రం. ఈ అభ్యుదయ (ప్రజా) కవుల్ని వెనకేసుకొని వచ్చే అభ్యుదయ కాముకుల మని ప్రచారంచేసుకొనే బుద్ధిమంతులు పై పదాలకు అర్థం అవంతైనా అవగాహన కాకపోయినా, తెలిసినట్లు నటిస్తూ ఓహో, హా, అని తలలూపుతారు. ఎందుకీ ఆత్మవంచన? ఆంగ్లభాషా ప్రావీణ్యం గలిగిన అధికసంఖ్యాక వర్గంకూడ దీన్ని దూషిస్తుందే? అటు ఆంగ్లకవిత్వం గాక, ఇటు ఆంధ్రకవిత్వంగాక ఎంగిలి కవిత్వంగా మారింది కనుక అని విచారించనివారుండరనే నా భావం. మరి వీరు యీవిధంగా ప్రజలు పేరు చెప్పుకొని హేయమైన గేయకవిత్వాన్ని సృష్టిస్తున్నారే, ప్రజాకవులమని డప్పువాయించుకొంటూ అత్యున్నత స్థాయిలో వున్న కవిత అధోగతిపాలు చేస్తున్న వీరి నేమనాలి? స్వార్థపరులనా, సంఘాభివృద్ధి నిరోధక శక్తులనా. వీరి పోకడలనుబట్టిచూస్తే అటు అల్పసంఖ్యాకులైన పండితుల్ని సంతోషపెట్టలేక యిటు అధికసంఖ్యాకులైన ప్రజలను సంస్కరించలేక, ఏదో మధ్యమార్గంలో కవనం, మననం చేస్తూ నిజంగా ఒక త్రిశంకు స్వర్గాన్నే సృష్టించారనవచ్చు. ఛందోబద్ధమైన కవనం తెలిసి వ్రాసి, సారస్వతాన్ని సాంగోపాంగంగా తెలుసుకొను శక్తిలేక, ఆ పద్ధతి వీలుపడదని ఈపెరటిత్రోవ త్రొక్కారేమో ననుకోనవలసి వస్తోంది.

ప్రజా కవిత్వమంటే, ప్రజకి ప్రగతి మార్గాన్ని చూపించాలి. విప్లవభావాల్లో అభ్యుదయమార్గాల్లో ప్రజల్ని పురోగమింప చెయ్యాలి. అప్పుడు ఈకవిత్వం సారస్వతదృష్ట్యా చులకన చేయబడ్డా అది ప్రజాపరమైన ప్రయోజనం సాధించ గల్గిందంటే అదొకవిధంగా ప్రశంసనీయమే. కాని అదింతవరకు ఆచరింపబడలేదు.

పాటలు బాగున్నాయి. భావాల్లో నిమిత్తం ఏమిటి అని అత్యల్పసంఖ్యాక ప్రజలీ గేయ కవిత్వాన్ని మెచ్చుకున్నారు కదా అని సర్వప్రజాప్రశంస నందిన కవిత్వం యిదిఅని విచ్చలవిడిగా విర్రవీగి, మెప్పుకోసం తప్పుడు కవిత్వం సృష్టించి, భావరహితమైనటువంటి, సందర్భశుద్ధి లేనటువంటి గేయాల్ని రచించి ప్రజాపరమైన యే ప్రయోజనాన్ని సాధించలేకపోయారు నేటి అభ్యుదయ గేయకర్తలనుకునే వారు.

మరో విషయం. ఈగేయకవితా దుమారం యింతటితో ఆగడంలేదు. యిది అందరి కళ్లల్లోనూ దుమ్మెత్తిపోస్తోంది. ప్రజాసేవ చేస్తాం అంటూ బయల్దేరిన ప్రజానాయకుల్లాగా అనేకమంది గేయరచయితలు రోజురోజుకూ ప్రభవిస్తున్నారు. అయితే వీరిని అభినందించ నవసరం లేదా యిల్లాంటి ఘనకార్య సాధనకు ముందంజవేస్తే నంటారేమో. ఇది ఎలాంటి ఘనకార్యమో యింతకుముందు వివరపర్చాను. కాని యీలోటుల సవరించి నిష్పాక్షిక రచనలతో కేవలం ప్రజలనే దృష్టిలో పెట్టుకొని వారిప్రయోజనానికి విప్లవభావాల్లో అభ్యుదయపథాగ్రస్థానికి అడుగువేసేటట్లు చేస్తున్నారా అంటే అది అభినందనీయమే. ఇంత దేశవ్యాప్తమైన యీకవిత్వాన్ని విద్యార్థుల పాఠ్యగ్రంథాలుగా పఠింపచేస్తే, అవిద్యార్థుల కేమిభాష వస్తుంది. వారు చదివేదేమి వుంటుంది. గేయకవిత్వం అంటే పుస్తకాలు చదువకుండానే యిలాంటి(పైనుదహరించిన లక్షణాలు కలవి) గేయాలు వ్రాసి ఒక్కొక్క విద్యార్థి ఒక్కొక్క గేయ కవిగా మార్తాడు. ఇప్పటికే అసభ్యమైన భాషలో పరీక్షాపత్రాలు వ్రాస్తుంటే చెవలేని,చందస్సు లేనిజాలపదగేయాలే పాఠ్యగ్రంథాలే అయితే యింకా మన భాష సంస్కృతి విషయం గతేమిటో వేరే చెప్పాలా!

అందుచేత నేటిఅభ్యుదయగాయకులు నిర్దుష్టమైన నిష్కళంకమైన రచనల్లో ప్రజలు దానినుండి ఒక అనుభూతిని పొందగలిగేటట్లు గేయాల్లో ప్రజలకందుబాటులో వుండే భావాల్తోనూ భాషల్తోనూ వ్రాస్తుంటే, సాహిత్యంలో హేయంగా చూడబడ్డా, యీ గేయకవిత్వం ఏదోఒక ప్రయోజనం సాధించిన ట్లవుతుం దీయుగంలో.

# సినిమా

## నగరంలో సినిమాలు

| | | |
|---|---|---|
| మహారాణి | రైతుబిడ్డ | (తెలుగు) |
| చిత్రా, సరస్వతి, బ్రాడ్వే, కామధేను | మాంగళ్యం | (తమిళం) |
| శ్రీకృష్ణా, వెలింగ్టన్, రాజకుమారి, ఉమా, లక్ష్మి (పెరంబూర్) | పెణ్ | ,, |
| ప్రభా | దేవదాసు | ,, |
| సన్ | అందనాళ్ | ,, |
| భారత్ | కళ్యాణం పణ్ణియుం బ్రహ్మచారి | ,, |
| సినిమా సెంట్రల్ | కాంచన | ,, |
| పారగన్ | ఎన్ తంగై | ,, |
| కాసినో | పార్గవాసల్ | ,, |
| గెయిటీ | ధూన్ | (హిందీ) |
| అశోక్ | మశాల్ | ,, |
| స్టార్ | టాక్సీ డ్రైవర్ | ,, |
| సెలెక్టు | ఆర్ పార్ | ,, |
| న్యూగ్లోబ్ | How to Marry a Millionaire | |
| ఓడియన్ | Sashatchewan | |
| న్యూ ఎల్ఫిన్‌స్టన్ | Hondo | |
| రాక్సీ | Salome | |
| మినర్వా | Genevieve | |
| ప్లాజా | Because of Eve | |
| రీగల్ | Brick Bradford | |

## మరొక సినిమా స్కోప్ చిత్రం

మద్రాస్, న్యూగ్లోబ్ థియేటరులో మరొక సినిమా స్కోప్ చిత్రం విడుదల ఆయినది. ట్వెంటియెత్ సెంచరీ ఫాక్సువారు తమ మొదటిసినిమా స్కోప్ చిత్రానికి (దిరోబ్) క్రైస్తవమత ప్రచారకమైన కథ తీసుకుని ఈ రెండవ చిత్రానికి అమెరికన్ జీవిత విధాన ప్రదర్శకమైన ఇతివృత్తం ఎన్నుకున్నారు ఇందులో ముగ్గురు పెళ్లి కాని యువతులు - మేరిలిన్ మన్రో, బెట్టీ గ్రేబుల్, లారెన్ బకాల్ - ఉన్నారు. వీరు తీరా పెళ్లిచేసుకో దలచి వచ్చేటప్పటికి ఒక్కొక్కరికి ఇద్దరేసి పురుషులచొప్పున తటస్థ పడతారు. వారి వివాహ సమస్యద్వారా ఒక్కొక్కని హాస్యం, వినోదం బయలుదేరి చిత్రం కామెడీగా ముగిసిపోతుంది.

న్యూయార్క్‌లోని సైస్క్రేపర్ భవనాలు, న్యూయార్క్ రేవు, సన్‌వాలీలోని హిమావృత ప్రదేశాలు, మొదలైనవాటి దృశ్యాలు టెక్నికలర్ సినిమాస్కోప్‌లో అత్యంత మనోహరంగా ఉండి ప్రేక్షకులను ఉర్రూతలూగిస్తాయి.

ఈచిత్రం దర్శకుడు జీన్ నెగూలెస్కో.

### "ధూన్"

సెల్వర్ ఫిలిమ్సు వారి "ధూన్" హిందీ చిత్రం మున్నటి నుండీ మద్రాస్, గెయిటీ థియేటర్‌లో ప్రదర్శింపబడుతోంది. నర్గీస్, రాజ్ కపూర్ నాయికా నాయకులు. యువతులు చదువుకొన్నందువల్ల చెడిపోతారనీ, చదువుకున్నవారు గృహిణి బాధ్యతలు మరింత చక్కగా నెరవేర్చే సమర్థత సంపాదించుకుంటారనీ ఈచిత్రంలో సారాంశం. కామిని, రాజ్ బాల్య స్నేహితులు. వారికి పెళ్లిఅవుతుంది. కామిని చదువుకున్న దేవా బుద్ధిమంతు రాలని తన స్నేహితులకు నిరూపించ డానికై రాజ్ పిచ్చిఎత్తినట్లు నటిస్తాడు. అతనికి పిచ్చిఎత్తిన కాలంలో అతనిభార్య కామిని ఉత్తమగృహిణిగా ప్రవర్తిస్తూ, అనేక విపత్తు పరీక్షలను నెగ్గి చివరికి అందరి మన్ననలూ పొందుతుంది. చివరికి రాజ్ పిచ్చిఎత్తినట్లు నటించడం మానివేసి ఆమెను స్వీకరిస్తాడు.

ఈ చిత్రంలో పిచ్చి అనుభూతి దృశ్యాలు సమృద్ధిగా ఉండి ప్రేక్షకులకు వినోదం కలిగిస్తాయి. సంగీత దర్శకుడు మదన్‌మోహన్. దర్శకుడు ఎమ్. కుమార్. లతా మంగేష్కర్ రఫీ, హేమంతకుమార్ పాడిన ప్లేబాక్ పాటలు ఆహ్లాదకరంగా ఉన్నాయి.

# కాల్వల తగాదాపై పాకిస్తాన్ ప్రచారం

## ఢిల్లీ వర్గాల ఆశ్చర్యం

న్యూఢిల్లీ, జులై 2: భారతదేశం బక్రా కాల్వలకు నీరు ఎక్కించడంవల్ల సట్లేజి నీరు దెబ్బతింటుందని, అందువల్ల పాకిస్తానులో కాల్వలు ఎండిపోతాయని పాకిస్తాన్ ప్రారంభించిన ప్రచారం ఢిల్లీలో ఆశ్చర్యం కల్గిస్తున్నది.

అదీకాకుండా సింధునది నీటి వ్యవహారాన్ని గురించి, వాషింగ్టన్‌లో ఇంకా సమాలోచనలు జరుగుతున్నా, ప్రపంచ బ్యాంకుతో యీ రెండు రాజ్యాల సమాలోచనలు విఫలం అయినట్లు తానై ఇండియా ప్రచారం చేస్తున్నదని పాకిస్తాన్ చేస్తున్న వ్యాఖ్యానాన్ని చూచి, ఢిల్లీలోని అధికారవర్గాలవారు నవ్వుతున్నారు.

సట్లేజి నీటి విషయంలో ఇండియా తాను 1952 లో పాకిస్తాన్‌తో వ్రాసుకొన్న ఒప్పందాన్ని తుచ తప్పకుండా పాటిస్తున్నదని, ఇదేసందర్భంలో ఇండియా 1948 జూన్ 4న పాకిస్తానుతో ఈ కాల్వలనుగురించి చేసుకున్న ఒప్పందాన్ని గూడా పాలిస్తున్నదని ఇచ్చటి అధికారవర్గాలవారు అంటున్నారు. ఈ ఒప్పందం ప్రకారం కొంతకాలంపాటు ఇండియా, పాకిస్తాన్ కాల్వలకు నీరును వదలాలి. ఈ వ్యవధిలో వారు వేరే ఏర్పాట్లు చేసుకోవలసివుంది. ఈ ఏర్పాట్ల ప్రకారం ఇండియాకు ఈ పాకిస్తాన్ కాల్వలకు నీరునుఇచ్చే సౌకర్యాన్ని క్రమంగా తగ్గించే అధికారం వున్నట్లు పాకిస్తాన్ గుర్తించింది. ఇంతలో ప్రపంచబ్యాంకు వారు ఈ వ్యవహారంలో జోక్యం చేసుకొని, పంజాబులోవున్న ఆరు నదులను గురించి ఈ రెండు రాజ్యాల మధ్య ఏర్పడినతగాదాను పరిష్కారం చెయ్యడానికి పూనుకుంది. అందుకు రెండు దేశాలూ అంగీకరించాయి. ఇండియా తరఫున ఇంజనీర్లు కోస్లా, గులాటీలు, అట్లాగ పాకిస్తాన్ తరఫున ఒక ఇద్దరు ఇంజనీర్లు ఈ సమాలోచనలో పాల్గొన్నారు. ఈ సమాలోచనలు దీర్ఘకాలం జరిగిన అనంతర ప్రపంచబ్యాంకు తన తీర్పును ఇచ్చింది. ఈ తీర్పులో ముఖ్యంగా నీటిని కొన్ని రుతువులలోనూ, సింధు, జీలం, చీనాబ్ నదులను పాకిస్తాన్ వాడుకోవటట్లు, రావీ, బియాస్, సట్లేజ్ నదులను ఇండియా వాడుకునేట్లు ఏర్పాటుచేశారు. ఒక ఐదేళ్లపాటు తనవంతుకువచ్చిన నదులనీటినిఇండియా పాకిస్తాన్ కాల్వలకు వదులుతూ వుండాలి. ఈ అయిదేళ్లలోను పాకిస్తాన్ తన కాల్వలను తనవంతు నదులతో కలుపుకోవాలి. ఇవి అన్నీ చెబుతూ, ఈ తీర్పులో ఆ బ్యాంకు, ఏడశానికి, ఆ దేశానికి తనదేశంలో కాల్వలను త్రవ్వుకొనే స్వాతంత్ర్యం ఈ వ్యవధికాలంలో గూడా వున్నదని గుర్తించారు.

పాకిస్తాన్ ఈ తీర్పును తిరస్కరించింది. ఈ నిర్ణయాన్ని మార్చుకునేందుకు తగినంత వ్యవధిని, ఆ బ్యాంకువారు, ఇండియా ప్రభుత్వముగూడా పాకిస్తాన్‌కు ఇచ్చాయి. అయినా పాకిస్తాన్ తన నిర్ణయాన్ని మార్చుకోలేదు. మార్చుకోకపోవడంవల్ల, ఈ రెండు దేశాలమధ్య ఏర్పడిన ఈ తగాదా తిరిగి 1948 నాటి ఒప్పందం స్థితికివచ్చిందని, దాన్నిబట్టి పాకిస్తాన్‌కు సప్లయి చేసున్న నీటిని తగ్గించే అధికారం ఇండియాకు వున్నా, 1952 మార్చి ఒప్పందాన్ని గూడా అనుసరిస్తూ, ఆ నీటిని సప్లయిచేస్తూ వస్తున్నదని ఇచ్చటి అధికారవర్గాలవారు పేర్కొంటున్నారు.

ఇక ఇప్పుడు యీ సప్లయిలు తగ్గడానికి కారణం ఏమిటోగూడా యీ అధికారులు వివరిస్తున్నారు. ప్రస్తుతం బక్రానది క్రిందికాల్వలను శాఖచేస్తున్నారు. అందువల్ల నీటిని వదలటం ఆలస్యంఅయింది. ఇట్లాజరిగిన ఆలస్యాన్ని గురించి, దుష్ప్రచారాన్ని పాకిస్తాన్ ప్రారంభించిందంటే, దాన్నిగూర్చి ఇక్కడ చాలా ఆసహ్యం ప్రబలుతున్నది. అదీకాక సట్లేజ్ నీళ్ళను గ్రహించేబక్రా కాల్వలను దశవిధిజవకు ఎంతోముందే ఇంగ్లీషువాళ్లు ప్రారంభించారు. ఆ ప్రారంభించినప్పుడు సట్లేజ్ నీటిని తూర్పు పంజాబు, పెప్సూ, రాజస్థాన్ ప్రాంతాలకోసమని నిర్ణయించుకొనే ప్రారంభించారు. యీ విషయాన్ని దృష్టిలో వుంచుకొనే ఇండియా ప్రభుత్వం బక్రా-నంగాల్ ప్రాజెక్టును ప్రారంభించింది. పాకిస్తానుగూడా ఆదృష్టితోనే బల్లోకి-సులేమాన్‌కీ బిరేను పూర్తిచేసింది. ఈపని జరగడంవల్ల బక్రా కాల్వలకు నీటిని వదలకపోయినా, పాకిస్తాన్‌కు వచ్చేనష్టం ఏమిలేదు. అయినా పాకిస్తాన్ తన కాల్వలు ఎండిపోయినాయంటున్నది. అది అబద్ధం.

ఇక సింధు నదుల నీటి తగాదాను గురించి. ప్రపంచబ్యాంకు తీర్పును పాకిస్తాన్ నిరాకరించడంతో, ఆ సమాలోచనలు భగ్నం అయిపోయినాయి. ఇండియా ప్రతినిధివర్గం ఇంటికి తిరిగి గూడా వస్తున్నది. అయితే, ఈ తగాదాలో ప్రపంచబ్యాంకు ఇచ్చిన తీర్పును పాకిస్తాన్ సూత్రరీత్యా అంగీకరిస్తే తిరిగి సమాలోచనలలో పాల్గొనడానికి ఇండియా ఎప్పుడు సిద్ధంగానే వుంది. పాకిస్తాను తాను బ్యాంకు తీర్పును తిరస్కరించను లేదు, అంగీకరించను లేదు అంటే చెల్లదు. ఎందుచేతనంటే యీ తీర్పునుగూర్చి పాకిస్తాన్ వ్రాసిన ఉత్తరాన్ని చూచి, బ్యాంకువారుగూడా అది యీ తీర్పును తిరస్కరించిందనే నిర్ణయంచేశారు. అందువల్ల ఆ సమాలోచనలు ఇంకా కొనసాగుతున్నాయని చేసేవాదం అర్థరహితమైనదని, దురాగ్రాలకు దారితీసేదని, యీ అధికారవర్గాలవారు వాదిస్తున్నారు.

## పాత తపాలా బిళ్ళల ఉపసంహరణ

### అక్టోబరు 1వ తేదీకి జరిగే అవకాశం

న్యూఢిల్లీ, జూలై 2: స్వాతంత్ర్యావతరణకు పూర్వం ముద్రించి విడుదల చేసిన తపాలా బిళ్లను త్వరలో నే బహుశా తపాలాబిళ్ల శతవార్షికోత్సవాలు జరిగే నాటికి ఉపసంహరించడం జరుగగలదని తెలుస్తూంది.

తంతి తపాలాశాఖ డైరెక్టరు జనరల్ హెచ్. ఎల్. జెరాత్ ఇవాళ ఈ విషయం విలేకరులకు చెప్పారు.

ఇందుకు సంబంధించిన అధికార ప్రకటన త్వరలోనే వెలువడగలదనీ, ఎంతయినా 1954 అక్టోబరు ఒకటవ తేదీ నాటికి వెలువడుతుందనీ ఆయన తెలియచేశారు.

ఈ పాత తపాలా బిళ్లలు నిలవ చేసుకున్నవారు, వాటికి బదులు కొత్తవాటిని తీసుకోవడానికి ప్రకటన వెలువడిన నాటినుంచి మూడు మాసాల గడువు ఇవ్వబడుతుందని కూడా ఆయన వెల్లడించారు.

### జనవరి 26 నాటికి కొత్త తపాలా బిళ్లలు

వచ్చే రిపబ్లిక్ దినోత్సవం (1955 జనవరి 26) నాటికి కొత్తతపాలా బిళ్లలు ముద్రించబడగలవనుకుంటున్నామని తంతి తపాలాశాఖ డైరెక్టరు జనరల్ హెచ్. ఎల్. జెరాత్ ఇవాళ విలేకరులతో అన్నారు.

ఇప్పటి బిళ్లలపై ముద్రించిన వివిధ శిల్పాల చిత్రాలకు బదులుగా, కొత్త తపాలా బిళ్లలపై పంచవర్ష ప్రణాళిక కార్యక్రమాలకు సంబంధించిన చిత్రాలు ముద్రించబడగలవని ఆయన అన్నారు.

రేటు గురించిన మరి రెండు విశేషాలను కూడా జెరాత్ తెలియచేశారు.

ఇప్పుడు అమలులో ఉన్న స్టాంపుల ధరలు 15 రూ॥ల వరకూ ఉన్నాయి. కొత్తస్టాంపుల ధర గరిష్ట ప్రమాణం 10 రూ॥ లే ఉంటుందట.

పోతే పరిమాణం ఇప్పటిలాగే ఉంటుందికాని, ఇప్పటి విమాన శాఖకు సంబంధించిన చిత్రాలకు బదులుగా, భారతదేశంలో జరిగిన విమానయానాల అభివృద్ధిని చూపే చిత్రాలతో 4 పెద్దస్టాంపులు విడుదల చేయబడుతవి.

ఈ నాలుగింటి పైనా, బొంబై కన్యాకుమారి, డార్జిలింగ్ బనిహాలు కనుమలదృశ్యాలు చిత్రీకరించబడుతవని జెరాత్ చెప్పారు.

మద్రాసు, జూలై 2: మద్రాసు విశ్వవిద్యాలయం 1954 జూనెలో జరిపిన బి. ఏ. ఎస్. సి. డిగ్రీ (స్పెషల్), సాన్ఫోర్డ్‌లో ప్రత్యేకపరీక్ష, జన్మ విజ్ఞాన డిప్లొమా పరీక్షా ఫలితాలు 6-వ తేదీన స్థానికపత్రికలలో ప్రచురించబడతాయి.

# కాంగ్రెసు వాదులకు మైసూరు ముఖ్యమంత్రి హితవు

మైసూరు, జూలై 1: ముఖ్యమంత్రి శ్రీ కె. హనుమంతయ్యగారు నేడు మైసూరులో కాంగ్రెసు వాదుల సభలో ఉపన్యసిస్తూ కాంగ్రెసు వాదులు ప్రజలతో విరివిగా తమ సంబంధాలను పెంపొందించుకోవాలన్నారు.

ప్రజలు ప్రభుత్వానికి తెలియజేయగోరే విషయాలను ఆయా కాంగ్రెసు సంస్థల ద్వారా పంపితే తొందరగా పరిశీలన జరుగగలదన్నారు.

## ప్రకాశంగారు

ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ టి. ప్రకాశం పంతులుగారు జూలై 5 నాటికి గుంటూరులో హైకోర్టు ప్రారంభోత్సవానికి హాజరై, 8 తేదీన ఢిల్లీ వెడుతారని తెలుస్తోంది. జూలై ఆఖరుకు నేత్ర చికిత్సకు మరల బెంగుళూరుకు రావాలట.

## అరెస్టుకాబడిన సన్యాసి జామీనుపై విడుదల

మైసూరులో యిటీవల అరెస్టు చేయబడి రిమాండులో ఉంచబడిన "సన్యాసిని" జామీనుమీద విడుదల చేశారు.

## ఉర్లగడ్డల నిల్వ పద్ధతి

### ఆహార పరిశోధనా కేంద్ర సూచన

మైసూరు ఆహార పరిశోధనా కేంద్రంలో పండ్లను, కూరగాయలను 'రెఫ్రిజరేటరు' పద్ధతినిగాక చాల కాలం వానిని చెడకుండా నిల్వ చేయుటకై పరిశోధన గావించడానికి యేర్పాట్లు జరిగాయి. ఉర్లగడ్డల పైరుపై ఒక విధమైన ద్రావక మిశ్రిత జలాన్ని చల్లితే సుమారు 8 నెలల కాలం చెడకుండా నిల్వ చేయవచ్చునట. దీనికి ఖర్చు ఎకరానికి రు 5 లు మాత్రమే అవుతుందని అన్నారు. (స్వ. వి.)

# రాజకీయ బాధితులకు భూములు

## నర్సరావుపేట డివిజన్ రాజకీయబాధితులవిజ్ఞప్తి

నర్సారావుపేట, జూన్ 30: ఈ నెల 25 తేదీ ఉదయం యిక్కడ శ్రీ విక్టోరియా హాలులో డివిజన్ రాజకీయ బాధితుల సమావేశము శ్రీ మల్లాది వెంకటేశ్వరరావుగారి అధ్యక్షతన జరిగినది. రాజకీయబాధితుల భూమి సమస్య పరిష్కారమయ్యేవరకు ఒక స్పెషల్ డిప్యూటీ కలెక్టరును, ప్రత్యేక సిబ్బందిని నియమించుట అవసరమని ప్రభుత్వానికి సూచిస్తూ తీర్మానించారు.

లోగడ మంజూరు చేయబడిన భూములు రెట్టి పునర్విచారణలతో నిమిత్తంలేకుండా పట్టాల నిచ్చివేయవలెనని మరమ్మతులులేని చెరువు గర్భాలలోని బీడు భూములను ఇతరుల ఆక్రమణలో లేనివాటిని రాజకీయ బాధితులకు మంజూరు చేయవలెనని ప్రభుత్వాన్ని కోరుతూ మరో తీర్మానం చేశారు. ప్రత్యేకముగా ప్రభుత్వము వారియొద్దకు రాయబారము వెళ్లుటకు ఈ క్రింది 6 గురిని నియమించారు.

శ్రీయుతులు డా॥ మల్లాది వెంకటేశ్వరరావు, కనుపర్తి వెంకటేశ్వరశర్మ, దివి కోటేశ్వరరావు, కొప్పా వస్తుల శేషయ్య, బాబు నూరుకుచ్చి అంజనేయశాస్త్రి, సూజేటి పూర్ణచంద్రరావుగారలు, రాజకీయ బాధితుల విషయములో మద్రాస్ ప్రధాని గౌ॥ కామరాజనాడారుగారు అవలంబించిన వైఖరి సముచితమని కొనియాడారు. (స్వ. వి.)

# క్రీడారంగం

## వింబుల్డన్ లో డ్రాబ్నీ గెలుపు

### రోజ్వాల్‌తో తీవ్రపోటీ

లండన్, జులై 2: వింబుల్డన్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్‌ను సాధించటానికి 10 సం॥ల నుంచీ ఎడతెగకుండా ప్రయత్నిస్తూ నాలుగుసార్లు సెమిఫైనల్సుకూ, రెండుసార్లు ఫైనల్సుకూ రాగలిగిన జరోస్లావ్ డ్రాబ్నీ నేడు తన జీవితకాంక్షను సఫలం చేసుకున్నాడు. అతడీ వేళ ఆస్ట్రేలియా కుర్రవాడు కెన్ రోజ్వాల్‌ను తీవ్రపోటీమీద ఓడించి, సింగిల్సు ఛాంపియన్‌షిప్‌ను సాధించాడు (13-11, 4-6, 6-2, 9-7).

స్వదేశమయిన జెకోస్లవేకియాను వదిలిపెట్టి ప్రస్తుతం ఈజిప్టు పౌరుడుగా చెలామణీ అవుతున్న యీ ప్రముఖ టెన్నిస్ యోధుని విజయానికి చేరిక్కడి ప్రేక్షక మహాజనులంతా ఎంతో అభినందించారు. 32 సం॥లవాడయిన డ్రాబ్నీ అద్భుతమయిన ఓవర్‌హెడ్ ఆటతోనూ, మహా ఘాటైనాడున్న సర్వీసుతోనూ 2½ గంటలు పోరాడి యీ విజయాన్ని సాధించాడు. ఎడంచేతి ఆటగాడు యీ గౌరవాన్ని సాధించటమన్నది గడచిన 40 సం॥లలోనూ ఇదే మొదటిసారి. వింబుల్డన్ పోటీలు ప్రారంభమయిన 77 సం॥లలోనూ డ్రాబ్నీ అంతప్రాభవాన్ని పొందిన పోటీదారుడు మరొకడు లేడు.

అయితే రోజ్వాల్ కూడా చివరి వరకూ మహాపట్టుదలతో ఆడి, చివరి వరకూ ఫలితం ఎట్లాఉంటుందోనన్న సందేహం కలిగిస్తూనే వచ్చాడు.

మిక్సెడ్ డబుల్సు సెమిఫైనల్సులో రోజ్వాల్, మిసెస్ డ్యూపాంట్‌లు మిస్ కొనలీ, హోడ్‌లను ఓడించారు. (6-8, 6-4, 6-4). మిస్ హార్ట్, సెక్సాస్‌లు ఎం. ఆట్వుడ్, మిస్ బర్కిలను ఓడించారు (6-4, 6-1)

## నాటింగాం టెస్టు: ఇంగ్లండ్ విజృంభణ

నాటింగాం, జూలై 2: నిన్న ఇక్కడ ప్రారంభమయిన ఇంగ్లండ్ పాకిస్తాన్ రెండవ టెస్ట్ మాచ్‌లో ఇంగ్లండ్ ఈవేళ పూర్తిగా విజృంభించింది. నిన్న పాకిస్తాన్‌ను 157 పరుగులకే అవుటుచేయటమే కాక, యీ వేళ 6 వికెట్లకు 558 పరుగులు చేసి డిక్లరుచేసింది. అందులో కాంప్టన్ 278, సిమ్సన్ 101, గ్రేవ్నీ 84 పరుగులు చేశారు. పాకిస్తాన్ రెండవ ఇన్నింగ్సును ప్రారంభించి ఆటముగింపువేళకు వికెట్ నష్టంలేకుండా 59 పరుగులు చేసింది. హనీఫ్ 46, అలీముద్దీన్ 13 పరుగులతో బాటింగు చేస్తున్నారు.

మొదటి ఇన్నింగ్సు - పాకిస్తాన్ 157 (అపిల్యార్డు 51 కి 5 వికెట్లు), ఇంగ్లండ్ - సింప్సన్ (ఖలీద్ హసన్) 101, షెఫర్డు (ఇంతియాజ్, జా స్ మహమ్మద్) 37, మే (ఖాన్‌మహమ్మద్) 0, కాంప్టన్ (ఖలీద్ హసన్) 278, గ్రేవ్నీ (మక్సూద్, కర్దార్) 84, బెయిలీ (అవుటుకాలేదు) 36, ఇవాన్సు ఖాన్ మహమ్మద్) 4, వార్డిల్ (అవుటుకాలేదు) 16, ఎక్స్‌ట్రాలు 4, మొత్తం 6 వికెట్లకు డిక్లేర్డు 558 (బౌలింగ్—ఖాన్ మహమ్మద్ 155 కి 3).

రెండవ ఇన్నింగ్సు—పాకిస్తాన్—హనీఫ్ (అవుటుకాలేదు) 46, అలీముద్దీన్ (అవుటుకాలేదు) 13, ఎక్స్‌ట్రాలు 0, మొత్తం వికెట్ నష్టం లేకుండా 59.

## 120 గంటల సైకిల్‌స్వారి ప్రయత్న వైఫల్యం

మద్రాసు, జులై 2: 120 గంటలు విశ్రాంతిలేకుండా సైకిల్ తొక్కి కొత్త రికార్డు నెలకొల్పాలని ఇక్కడ ప్రయత్నించిన తిరుమూర్ సైక్లిస్టు జోసెఫ్ తోకలత్ ఈవేళ పొద్దున తన ప్రయత్నం విరమించుకున్నాడు. జూన్ 28 వ తేదీన ఎస్. ఐ. ఎ. ఏ. గ్రవుండ్సులో అతడు ప్రారంభించిన ప్రయత్నం వానమూలంగా, జ్వరంమూలంగా విఫలమయింది. అయితే అతడు 91½ గంటలులో క్రితం మద్రాసుకు కొత్తరికార్డు నెలకొల్పాడు.

ఇతడు త్వరలో ఇంగ్లండులో ప్రదర్శనలిచ్చేందుకు వెళ్లిపోతున్నాడు.

## సైకిల్‌పై ప్రపంచయాత్రకు భారత యువకుని సన్నాహం

జబల్పూర్, జూలై 2: మిత్రిలాల్ జయస్వాలె అనే బీహార్ యువకుడు తాను త్వరలోనే సైకిల్ మీద ప్రపంచ పర్యటన ప్రారంభించ బోతున్నట్లు నేడిక్కడ వెల్లడించాడు.

ఇదివరలో తాను ఇండియా, నేపాలులను సైకిల్ మీద పర్యటించి ఉన్నాననీ, అప్పుడు రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ తనకొక గడియారాన్నీ, నేపాల్ ప్రధాని కోయిరాలా ఒకఅభినందన లేఖనూ ఇచ్చారనీ అతడు తెలియజేశాడు.

## హైద్రాబాద్ బాడ్మింటన్

హైద్రాబాద్, జులై 1: నేడిక్కడ ఐ. ఓ. టి. బాడ్మింటన్ టూర్నమెంటు ఫైనల్సులో మహమూద్ షైన్సు (గులాం దస్తగీర్, మహమూద్ అలీ మహమూద్, రజా అలీ, మజీద్), వై. ఎం. సి. ఎ. జట్టును (హమీద్ పాషా, అహమద్ హుసేన్, అలీ అహమద్, సదాశివం, జలాల్) ఓడించారు (29-26, 29-11)

# రేడియో

## సోమవారం, జూలై 5

### విజయవాడ

ఉ॥ 6-55 స్వాగతం 7-0 తెలుగు వా॥ 7-15 మద్రాస్ (బి) వలె 7-30 మద్రాస్ వలె 8-0 ఆంగ్లవార్తలు.

మ॥ 12-30 మాధ్యమిక పాఠశాల విద్యార్థులకు 1-0 (బి) వలె 1-30 (ఎ) వలె 1-40 హిందీ వా॥ 1-50 తెలుగు వా॥ 2-0 (బి) వలె 2-15 ఉన్నత పాఠశాలల కార్యక్రమం (ఆం).

సా॥ 4-0 ప్రాథమిక పాఠశాల విద్యార్థులకు 5-30 నారుమంచి సాంబశివరావు 6-0 సంగీత శిక్షణ 6-15 ప్రాంతీయ వా॥ 6-25 స్థానిక ప్రకటనలు 6-30 గ్రామ కార్యక్రమం 7-0 తెలుగు వా॥ 7-15 రామదాసు భజన 7-30 కల్పవల్లి (బి) 7-45 గృహోపయోగ ఓషధులు-ప్రసంగము 8-0 రామదాసు (నాటకము) 9-0 ఆంగ్ల వా॥ 9-15 ఆంగ్లమున ప్రసంగం 9-30 ఎం. ఎస్. బాలసుబ్రహ్మణ్యశర్మ 10-0 ప్రసార సమాప్తి.

### మద్రాస్ (ఎ)

ఉ॥ 6-55 స్వాగతం 7-0 వాద్య సమ్మేళనము 7-15 తమిళ వా॥ 7-30 లలితా లక్ష్మీరతన్ 8-0 ఆంగ్లవా.

మ॥ 12-30 పాఠశాల (బి) 1-0 మహిళామండలి (బి) 1-30 (బి) 1-40 హిందీ వా॥ 1-50 (బి) 2-0 తమిళవా॥ 2-10 (బి) వలె 2-15 ఉన్నత పాఠశాలలకు (ఆం).

సా॥ 4-0 పాఠశాలలకు (బి) 4-30 పాశ్చాత్య సంగీతం 5-30 ఇందిరాబాయ్ ఖడీల్కర్ 6-0 ఆంగ్ల వార్తలు 6-15 ప్రాంతీయ వా. 6.25 మహారాజపురం సంతానం 7 మధురం (ప్రసంగం) 7-15 తమిళ వా. 7-30 చిపలి 7-45 భజన్ (బి) 8 దమయంతీ నటరాజన్ 8-30 పి. ఎస్. రాఘవరావు 9 ఆంగ్లమున వా. 9-15 హిందీ పాఠం (బి) 9-30 బి వలె 10-30 ప్రసార సమాప్తి.

### మద్రాస్ (బి)

ఉ॥ 7 తెలుగు వా. 7-15 ఉదయ గానము 7-30 ఎవలె.

మ॥ 12- కార్మికుల కార్యక్రమం 12-30 మాధ్యమిక పాఠశాల విద్యార్థులకు 1 గీతమాలిక 1-30 ఆంగ్లమున వా॥ 1-40 (బి) 1-50 తెలుగున వా. 2 క్లారినెట్ నిలయ విద్వాంసుడు 2-15 ఎవలె

సా॥ 4 ప్రాథమిక పాఠశాల విద్యార్థులకు 4-30 ఎవలె 5-30 ఎవలె 6-15 లలిత గీతం బి. సరళ. 6-30 గ్రామ॥ కార్యక్రమం 7 తెలుగున వా. 7-15 రామదాసు భజన గోష్టిగానము. 7-30 జంత్ర సమ్మేళనం 7.45 ప్రసంగం (మ) 8 రామదాసు (నాటిక) 9 ఎవలె 9-15 ఎం. కల్పకం 10-30 ప్రసార సమాప్తి.

### హైదరాబాదు

ఉ॥ 6-55 సుప్రభాత్ 7 తెలుగున వా. 7-15 వి. ఎస్. రామయ్యంగార్ 7-45 జహీద్ అలీ - ఘజలే 8 ఆంగ్ల వార్తలు 8-15 హిందీ వా. 8-30 ఎస్. ఆర్. జోషీ - ఖయాల్. 8-45 ఘజలే.

మ॥ 12.30 (బి) 12-50 మరాఠీ వా. 1 వాద్య సంగీత్ (బి) 1-10 (బి) 1-50 తెలుగున వా. 2 పాఠశాల కార్యక్రమం.

సా॥ 5-30 కె. అంజనేయులు 6 కన్నడ కార్యక్రమం 6-30 రాగరంజని (బి) 6-40 స్థానిక ప్రకటనలు 6-45 గీతాంజలి 7 తెలుగున వా. 7-15 రఘునాథ లక్ష్మీభాయ్ (బుర్రకథ) - సీతాపవూరి 7-45 కన్నడమున వా. 8 ప్రసంగం (ఉర్దూ) 8-15 ఆకాశవాణి మేళా 8-20 ఘజలే 8.30 ఎస్. ఆర్. జోషీ - ఖయాల్. 9 ఆంగ్లమున వా. 9-15 ఉర్దూ వా. 9-30 వి. ఎస్. రామయ్యంగార్ 10-15 నాదసుధ (బి) 10-30 ప్రసార సమాప్తి.

# మదరాసు ధరలు

మదరాసు, జూలై 3:

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎస్విరస్మోమ్స్ పేట్సుటార్సులో సవర్ రు. 57-12-0

| | | |
|---|---|---|
| పెట్లాబంగారం | తులం | రు. 85-8-0 |
| మూస బంగారు | | రు. 84-4-0 |
| సీమవెండి తులం100కి రెడి | | రు. 155-8-0 |
| చిల్లర ధర | | రు. 1-10-0 |

## వందదార

| | | |
|---|---|---|
| ఫాలోద్వా | (224 పౌ) | 84-0-9 |
| స్పానిష్ | (133 పౌ) | 50-0-9 |

## వేరుశనగ

(531 పౌ॥ 1-కి ఎక్స్పోర్టు గిడ్డంగుల మెషిన్-షెల్సుటార్సుతో సహా) రు. 140-145-0-0

వేరుశెనగనూనె ఎక్స్‌పెల్లర్ మిల్లో 3% (500పౌ.) రెడి చిల్లరధర రు. 273-275

కొంకోయనూనె (37½ పౌనులు)

| | | |
|---|---|---|
| అంబుమార్కు | రు | 29-8-9 |
| ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా | | 29-8-9 |
| రాజా బ్రాండ్ | రు. | 28-4-9 |

## బొంబాయిమార్కెట్

బొంబాయి, జూలై 3: ఇవాళ బొంబాయి వెండి బంగారు మార్కెట్

| | |
|---|---|
| వెండి (100 తు.) | 154-2-0 |
| బంగారం (1 తు.) | 84-2-0 |
| సావరిన్ | 56-14-0 |
| కలకత్తా మార్కెట్ ధరలు: | 152-2-0 |

84-2-0; 57-8-0.





Edited, Printed & Published by S. Sambhu Prasad at the AndhraPatrika Press, No. 7, Thambu Chetty St, Madras.